# సాయి
# చమత్కారవాణి



సంకలనం

కొమరగిరి కృష్ణమోహనరావు

ఎడిటర్ 'శ్రీవాణి'

శ్రీవాణి పబ్లికేషన్స్

24-52, రామానాయుడుపేట, మచిలీపట్నం - 521 001.

# సాయి చమత్కారవాణి

ప్రధమ ముద్రణ : 2000

ద్వితీయ ముద్రణ : ఫిబ్రవరి 2002

కాపీలు : 1500

వెల : రు. 20-00

ప్రతులకు :

శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్

ప్రశాంతి నిలయం - 515 134.

అనంతపురం జిల్లా.

ముద్రణ :

శ్రీవాణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్

రామానాయుడుపేట,

మచిలీపట్నం - 521 001.

ఫోన్ : 08672 - 21137, ఫ్యాక్స్ : 08672 - 26667

# సాయి చమత్కారవాణి

## (ఆధ్యాత్మిక ఆణిముత్యాలు)

**భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు** తమ ప్రవచనాలలో అప్పుడప్పుడు కొన్ని ఆధ్యాత్మిక ఆణిముత్యాలను భక్తులకు అందిస్తుంటారు. అవి పైకి చమత్కారాలుగా కనిపిస్తాయి, వినిపిస్తాయి. కాని వాస్తవానికి అవి జీవితానికి అవసరమైన నిత్యసత్యాలు. ఆ మాటలలో ఎంతో నిగూఢమైన అంతరార్థం వుంటుంది. బాహ్యార్థములు మాత్రమే తీసుకొనేవారికి అంతరార్థం బోధపడదు. లోతుకు పోయి ఆ మాటలను సునిశితంగా పరిశీలించి, పరిశోధించేవారికి మాత్రమే ఆ మాటలలోని అంతరార్థం అర్థమవుతుంది. వాటిలో ఆచరించవలసినది ఎంతో ఉన్నదనే విషయం బోధపడుతుంది. స్వామి వాడే పదజాలం పైకి చమత్కారంగా గోచరించినా, వారి ప్రతి మాటలో ఎంతో అంతరార్థం యిమిడి వుంటుంది. అసలు స్వామి మొట్టమొదట **'చమత్కారం'** చేస్తారు. మహిమలను చూపిస్తారు. వాటిని చూచి మనం ఆకర్షితులమవుతాం. చమత్కారాలతో చేసే ప్రసంగాలను విని సంతోషిస్తాం, ఆనందించి కరతాళ ధ్వనులను చేస్తాం. చమత్కారాలతో కూడిన ఆధ్యాత్మిక ప్రసంగాలు వినగా వినగా మనలో **'సంస్కారము'**ను కలుగ చేస్తాయి. ఆ సంస్కార ఫలితంగా సిద్ధిస్తుంది మనకు **'పరోపకారబుద్ధి'**. ఆ తరువాత మనం అందిస్తాం, నిస్వార్థబుద్ధితో యితరులకు **'సహకారం'**. ఆ పరోపకారబుద్ధియే **'ఆత్మసాక్షాత్కారము'**నకు తొలి మెట్టు అవుతుంది. **'చమత్కారం, సంస్కారం, పరోపకారం, సాక్షాత్కారం'** ఈ నాలుగు అంతస్తుల సోపాన మార్గమే భగవాన్ సాయి చూపే **'ఆధ్యాత్మిక మార్గము'**. ఆ మార్గంలో నడచిన వారు 'ఆత్మసాక్షాత్కారము' ను పొందగల్గుతారు.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు అందించిన ఆధ్యాత్మిక ఆణిముత్యాలను కొన్నింటిని (తెలుగులో - 54, ఆంగ్లంలో - 54) ఈ చిన్న పుస్తకం ద్వారా అందిస్తున్నాను. శ్రద్ధగా చదివి ఆనందించి, అవగాహన చేసుకొని, ఆచరణలో పెట్టి తరిస్తారని ఆశిస్తున్నాను. ఇవి చమత్కారాలుగా భావించకండి! ఆధ్యాత్మిక ఆణిముత్యాలుగా స్వీకరించండి.


భవదీయ

**కొమరగిరి కృష్ణ మోహనరావు**

**(సంపాదకులు 'శ్రీవాణి' మాసపత్రిక)**

**మచిలీపట్నం,**

**ది. 15-1-2000**



## అసూయ - అనసూయ

"అసూయకు No Season, No Reason. భయంకరమైన కాన్సర్ నివారణకు ఒక ఔషధం వున్నదిగాని ఈ 'అసూయ' అనే రోగమును నివారించుటకు ఏమాత్రం వీలుకాదు" అని భగవాన్ బాబావారు చెబుతూ ఈ అసూయకు ద్వేషము, క్రోధము, లోభములనే బిడ్డలు: అనసూయకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు (సహనం, ప్రేమ, సానుభూతి) బిడ్డలుగా పుట్టారని చెప్పారు. కామ క్రోధలోభములే సాధకునికి పరమ శత్రువులు. కామం పెరిగి పెనవేసుకొని, ఉరిగామారి, తనతోపాటు తన వంశాన్నే సర్వనాశనం గావించుకున్నాడు 'రావణాసురుడు'. దీనికి అహంకారం కూడా తోడై, పంచభూతములను వశం చేసికొనిన 'హిరణ్యకశిపుడు' క్రోధంతో సర్వనాశనం అయినాడు. అసూయ పెరిగి, ద్వేషం పెల్లుబికి, లోభంతో ధర్మ పరాయణులైన పాండవులకు సూదిమొన మోపే స్థలం కూడా యివ్వడానికి నిరాకరించి, తనతోపాటు తన కుటుంబాన్నే సర్వనాశనం గావించుకున్నాడు 'దుర్యోధనుడు'. "రామాయణం లోపల 'కామం' భాగవతంలోపల 'క్రోధం' భారతం లోపల 'లోభం' - ఈ మూడింటిద్వారానే సర్వశక్తివంతులైనవారు సహితం సర్వ నాశనం అయిపోయినారు" అని అంటారు బాబా. ఒక్కొక్కరిలో ఒక్కొక్క దుర్గుణం వుంటేనే, అలనాడు అంతటి మహాశక్తి సంపన్నులు కాలగర్భంలో కలిసిపోయారు. ఈ అన్ని దుర్గుణములు ఈనాడు ఒకే వ్యక్తిలో కూడుకొని ఉన్నాయి. ఇటువంటి దుర్గుణాలకు నిలయమైన ఈనాటి మానవుడు ఎంతటి హీనమైన స్థితికి దిగజారిపోతాడో! ఈనాడు ప్రపంచంలో జరుగుతున్న దుస్సంఘటనలు ఇందుకు తార్కాణం. కనుక మనం అసూయా సంతతివారం కాకూడదు. అనసూయ సంతతి వారం కావాలంటారు బాబా.

## అర్హత - అధికారం

"**ఈనాడు అర్హత లేనివారు అధికారాన్ని కాంక్షిస్తున్నారు. అర్హతగల రాముడు మాత్రం ఆనాడు అధికారాన్ని ఆశించలేదు. ఈనాడు అనర్హులు అధికారాన్ని అందుకోవడానికి తాపత్రయపడుతున్నారు. ఆనాడు అర్హతగల రాముడు అధికారాన్ని త్యజించి అడవులకు వెళ్ళాడు**" అని చెప్పారు భగవాన్‌బాబా. పట్టాభిషేకమునకు సిద్ధంగావున్న రాముడు మరుక్షణంలో, అదే చిరునవ్వుతో ఆనందంగా అడవులకు వెళ్ళాడు. సుఖదుఃఖాలను రెంటిని సమంగా స్వీకరించాడు. మహారాజు కావడానికి ఎంత సంతోషించాడో, అడవికి వెళ్ళడానికి కూడా అదే సంతోషంతో వెళ్ళాడు. రామతత్త్వం ఎంతో పవిత్రమైన తత్త్వం. అందువలననే శ్రీరామచంద్రుడు ఆదర్శ ప్రభువు అయినాడు. రామరాజ్యం ఆదర్శరాజ్యంగా వెలుగొందింది.

## అదుపు - పొదుపు

**ఆశలపై అదుపు, ఆహారపదార్థముల పొదుపు చేయాలంటారు** భగవాన్‌బాబా. **'కోరికలపై అదుపు'** (Ceiling on Desires) అనే ఉద్యమాన్ని శ్రీ సత్యసాయి సంస్థలు చేబట్టాయి. అయితే 'ఆశ' అనేదే లేకపోతే మానవుడు తన మనుగడనే కొనసాగించ లేడు. అయితే 'ఆశ'కు హద్దువుండాలి. అదుపు వుండాలంటారు బాబా. అయితే ఈనాడు ఆశలను అరికట్టుకోవడానికి ప్రయత్నించకుండా కేవలం కోరికల అదుపు పేర కొంత ధనమును మాత్రం బ్యాంక్‌లో దాచిపెడుతున్నారు. బాబా కోరేది అదికాదు. **'మీ ఆశలను అరికట్టుకొని, వైరాగ్యమార్గంలో దివ్యానందాన్ని అనుభవించాలనేదే నా ఆశ'** అని అంటారు బాబా. మనం ప్రతిరోజూ కాలాన్ని, ధనాన్ని, ఆహారపదార్థములను, మనశక్తిని ఎంతో వృథాచేస్తుంటాం. ఈ నాలుగింటిని పొదుపు చేస్తే, దేశం సస్యశ్యామలమవుతుంది. అసలు పొదుపు చేయటం కూడా ఒకరకమైన ఆధ్యాత్మికసాధనే. పరమేశ్వరుడు సృష్టించిన పంచభూతాలను కూడా పొదుపుగా వాడకపోతే, అది పరమేశ్వరుని తృణీకరించినట్లే అవుతుందంటారు బాబా. కనుక ప్రతివారు విద్యుచ్ఛక్తి, నీరు, వంటచెరకు, గ్యాస్, పెట్రోలు, డీజిల్ మొదలైన వాటిని కూడా పొదుపుగా వాడటం నేర్చుకోవాలి. 'పొదుపు' అంటే పిసినారితనమని భావించరాదు. అవసరానికిమించి వాడుకోనటం మహాపాపం. దేశసంపదను అనవసరంగా దుర్వినియోగపరుస్తే, నిత్యజీవితావసర వస్తువులుకూడా తారాస్థాయి నందుకుంటాయి. సామాన్య మధ్య తరగతి ప్రజలు అనేక యిక్కట్లకు గురిఅవుతారు. కనుక బాబా ఆశించేది "ఆశలపై అదుపు, ఆహారపదార్థముల పొదుపు" దీనిని ప్రతి ఒక్కరూ విజ్ఞతతో ఆచరించాలి.

## అహంకారి - దొంగ

"ప్రేమతో సేవ చేయాలి. దయ, ప్రేమలు హృదయంలో నింపుకోవాలి. ఈ రెండూ లేకుండా చేసేసేవలు కృత్రిమ సేవలు. ఆడంబరం కోసం, పేరు ప్రతిష్టల కోసం చేసినట్లుగా వుంటాయి. మనకు పేరు ప్రతిష్ఠలు అవసరం లేదు. ఆడంబరం అంతకంటేతగదు. ఆడంబరానికి పోతే అహంకారం పెరుగుతుంది. మనశక్తికి తగినట్లుగా మనం సేవ చేయాలి. శక్తికిమించి చేస్తే 'అహంకారి' అవుతాడు. ఉన్నశక్తిని ఉపయోగించకపోతే 'దొంగ' అవుతాడు. కనుక అహంకారీ కాకూడదు, దొంగా కాకూడదు. అహంకారం పతనానికి దారి తీస్తుంది. దొంగబుద్ధి గౌరవ మర్యాదలను మంట కలుపుతుంది" అని భగవాన్ బాబా సేవలను గురించి చక్కగా వివరించారు. మనం చేసే సేవలు ఒకరి మెప్పకోసం కాదు, పరులకోసం అంతకన్నా కాదు. తన కోసం తానుసేవలు చేయాలి. ఎవరి భవిష్యత్తు కోసం వారు సేవ చేయాలి. సేవ చేయటం మానవ విద్యుక్తధర్మం. సేవ కర్తవ్యమని భావించి చేయాలి. మానవసేవే మాధవ సేవని, సమాజసేవే సర్వేశ్వరుని సేవని భావించి చేయాలి. కనుక శక్తికి మించి చేయరాదు, ఉన్నశక్తి దాచుకోరాదు. హృదయపూర్వకంగా చేయాలి, ప్రేమతో చేయాలి. అప్పడే సేవ యోగంగా మారుతుంది.

## అన్నాన్వేషణ - ఆత్మాన్వేషణ

"దైవాన్ని వెదికే బుద్ధితో ధనాన్ని వెదుకుతున్నారు. ఆత్మను వెదుకవలసిన బుద్ధితో అన్నాన్ని వెదుకుతున్నారు. ఆత్మాన్వేషణ చేయకుండా అన్నాన్వేషణ చేయడం అజ్ఞానం కాదా? మనం బ్రతుకుతున్నది బ్రహ్మకొరకుగాని, అన్నం కొరకుకాదు. ఆహారం దేహసంరక్షణకేగాని, ఆత్మసంరక్షణకు కాదు. తినడానికి బ్రతకరాదు, బ్రతకటానికి తినాలి. "Eat to Live, Not Live to Eat" అన్నారు భగవాన్ సాయి. అయితే మానవుడు ఈనాడు తన జీవిత పరమావధి ఏమిటో గుర్తించలేక పోతున్నాడు. తన గమ్యమేమిటో గ్రహించలేకపోతున్నాడు. ఏదోవిధంగా పొట్టనింపుకోవాలని తాపత్రయపడుతున్నాడు. పశుపక్ష్యాదులుకూడా పొట్ట నింపుకొంటూనేవున్నాయి. అటువంటప్పడు మానవుని ప్రత్యేకత ఏమిటి? ఎన్నో జన్మల పుణ్యఫలం ఈ మానవ జన్మ. దీనిని సార్థకం చేసుకోవాలి.

## ఆశలు - ఆశయాలు

"ఆశలను తగ్గించుకోండి! ఆశయాలను పెంచుకోండి! స్వార్థాన్ని త్యాగం చేయండి! పరార్థాన్ని పెంచుకోండి! కుటిలత్వాన్ని త్రుంచివేయండి! విశాలత్వాన్ని

పెంచుకోండి! దేహాభిమానాన్ని తగ్గించుకోండి! దేశాభిమానాన్ని పెంచుకోండి! - ఇదే ఈనాడు మానవుడు చేయవలసిన సాధన" అని బోధించారు భగవాన్ సాయి. ఆశలు వుండవచ్చును కాని పరిమితంగా ఉండాలి. ఆశ పేరాశగా మారితే ఆ పేరాశ దురాశగా మరి, చిట్టచివరికి నిరాశ మిగులుతుంది. దురాశ దుఃఖమునకు దారితీస్తుంది. కనుక ఆశలు పరిమితం, ఆశయాలు ఉన్నతంగా ఉండాలి. అందువలన "ఆశయాలకోసం జీవించండి! ఆశలకోసంకాదు" అంటారుబాబా.

## ఉప్పు - పప్పు

"సద్గుణములు లేని మానవత్వం రుచిలేని పప్పువంటిది" అని అంటారు భగవాన్ బాబా. పప్పకు రుచి ఎప్పుడు వస్తుంది? ఉప్పు వేసినప్పుడు పప్పుకు రుచివస్తుంది. ఉప్పులేకపోతే చప్పగా ఉంటుంది పప్పు. చప్పగావున్న పప్పును మనం తింటామా? ఒక గంటలో అరిగిపోయే పప్పుపట్ల అంత శ్రద్ధ చూపిస్తున్నప్పుడు, డెబ్బై, ఎనభై ఏండ్లు వుండే ఈ మానవజీవితం పట్ల ఇంకా ఎంత శ్రద్ధచూపించాలి? గుణమే మానవునికి ప్రధానం. గుణరహితుడైన వ్యక్తిని సమాజం గుర్తించదు, గౌరవించదు. సద్గుణ సంపన్నుడైన వ్యక్తిని మాత్రమే సమాజం గౌరవిస్తుంది. అందువలననే సద్గుణములులేని మానవత్వం ఉప్పులేని పప్పువంటిదన్నారు బాబా. కనుక ప్రతి మానవుడూ సద్గుణ సంపన్నుడు కావాలి. అన్ని గుణముల కంటే 'ప్రేమ' ఉత్తమగుణం. కనుక ప్రేమనుపెంచుకొని, పారమార్థిక చింతనను అభివృద్ధి పరచుకొని, పరోపకారతత్త్వమును పెంపొందించుకోవాలంటారు బాబా. 'పరోపకారార్థం ఇదం శరీరం' గదా! కనుక భగవదానుగ్రహం వలన లభించిన ఈ మానవ జన్మను సార్థకం చేసుకోవాలి.

## కంచు - కనకం

"కంచు, కనకము రెండూ చూచినప్పుడు ఈ రెండూ ఒకటిగానే కనిపిస్తాయి. కాని కంచు శబ్దము ఘనంగా ఉంటుంది. 'కనకము' శబ్దము, శబ్దరహితంగా ఉంటుంది. కంచు విలువ తక్కువ, కనకం విలువ ఎక్కువ. విద్యార్థులు బంగారం లాగే నిరాడంబరంగా వుండాలిగాని, కంచులాగే ఆడంబరంగా ఉండకూడదు. విద్యయందు ఎట్టి ఆడంబరం పనికిరాదు. విద్యార్థులు ఆడంబరమైన మాటలను అదుపులో పెట్టాలి. మన మాటలు మధురంగా, వినయంగా ప్రకటింపజేయాలి. మనయొక్కరూపము, మన యొక్క భావము, మన యొక్క క్రియలు స్వచ్ఛమైనటువంటివిగా ఉండాలి. అమూల్యమైనటువంటివిగా ఉండాలి, శీలవంతమైనటువంటివిగా ఉండాలి. సౌజన్యం, సౌశీల్యం, సౌభాగ్యముగా

ఉండాలి. అందరూ Gold కావాలి. Rold Gold కాదు, Pure Gold" కావాలి అని అంటారు భగవాన్ బాబా. కనుక పిల్లలు స్వచ్ఛమైన బంగారం లాంటి పిల్లలుగా తయారు కావాలి. అనగా కంచువలెకాకుండా కనకమువలె తయారు కావాలి.

## కర్మ - అకర్మ - వికర్మ

"కర్మలు మూడు విధములు. కర్మ (Action) , అకర్మ (Unaction), వికర్మ (Inaction). ఇందులో 'వికర్మ' సూక్ష్మమైనది. **సూక్ష్మమై, సాత్వికమై, ఆత్మసందర్శన నిమిత్తమై, సర్వసంగపరిత్యాగము చేయునది ఇది. ఏది చూచినా, ఏది పలికినా, ఏది అనుభవించినా ఈశ్వరత్వముగానే అనుభవించుము"** అని అంటారు భగవాన్‌బాబా. 'అకర్మ' (Unaction) అనునది దీనికి పూర్తిగా విరుద్ధమైనది. అంతర్ కర్మలనుగాని, బహిర్ కర్మలనుగాని ఏమాత్రం చేయక, తమోగుణంలో స్తంభించి ఉంటుంది ఇది. ఇది తన స్వార్థం తప్ప అన్యము ఏమాత్రం ఆశించదంటారు బాబా. 'కర్మ' అనేది రజోగుణసంబంధమైనది. ఇది స్థూలమై, స్వార్థమును తరింపజేసుకొనే నిమిత్తమై, కర్మలను ఆచరిస్తుంటుంది. ఈ కర్మను చేసేవారు, తమ మనోవృత్తుల నిమిత్తమై కర్మల నాచరిస్తుంటారు. ఈ కర్మ క్రమేణా ఉన్నత స్థాయిలోనికి పోయి వికర్మలోనికి చేర్చుటకు వీలుగా వుంటుందని బాబా చెప్పారు. కర్మ, అకర్మ, వికర్మలనాధారంగా చేసికొని మానవత్వమును మూడు విధములుగా విభజించారని చెబుతూ అవే పశు మానవత్వం, మానవ మానవత్వం, దైవ మానవత్వములని బాబా పేర్కొనినారు. కనుక ప్రతి ఒక్కరూ కర్మలనాచరిస్తూ పశుత్వమునుండి దివ్యత్వానికి ఎదిగే ప్రయత్నంచేయాలి.

## కబంధులు - దైవబంధువులు

**"కబంధులం కారాదు, దైవబంధువులం కావాలి. మన సంబంధం కబంధం కారాదు, దైవబంధం కావాలి"** అని అంటారు భగవాన్‌సాయి. శబరి, గుహుడు, సుగ్రీవుడు, ఆంజనేయుడు, జాంబవంతుడు, విభీషణుడు, జటాయువు- వీరందరూ దైవంతో సంబంధం పెట్టుకొని ముక్తిని పొందారు. కబంధుడు రాక్షసుడు. రామలక్ష్మణులను సహితం తన బాహువులతో బంధించాడు. పరమాత్మను బంధించడం వలన తగిన శాస్తి అనుభవించాడు. కనుక మనం కబంధునిలా ప్రవర్తించరాదు. మానవుడు తనలోనున్న దివ్యత్వమును తెలుసుకొని, తోటి మానవులలోగల దైవత్వమును గుర్తించి, సన్నిహిత సంబంధం ఏర్పర్చుకున్నప్పుడు మనం దైవబంధువులం కాగలమంటారు స్వామి. కనుక మనలో నున్న రాక్షస

ప్రవృత్తిని విడనాడి; ప్రేమ, కరుణ, దయ, జాలి, త్యాగం వంటి దైవీగుణములను అలవరచుకోవాలి. ప్రేమజనితమైన త్యాగం, చిత్తశుద్ధిని కలుగజేసి, నిర్మలత్వానికి దారి తీస్తుంది. అట్టి నిర్మలత్వం ఏకత్వాన్ని సాధించి, దివ్యత్వాన్ని పొందుతుంది.

## కాముడు - రాముడు

ఈ జీవితమనే దీర్ఘ ప్రయాణంలో 'కోరికలు' అనే 'లగేజ'ని తగ్గించుకొనే ప్రయత్నం చేయాలి. ఈ కోరికల వలననే బంధనలు ఏర్పడుతున్నాయి. ఈ బంధనల ద్వారానే దుఃఖం ప్రాప్తిస్తున్నది. సీతాదేవి తన సర్వస్వమును త్యాగం చేసి, రాముడే నాకు ప్రధానం, ఆధారం అని భావించటం చేత రాముడు ఆమెకు దక్కాడు. దండకారణ్యంలో బంగారు జింకను చూచి, ఆమె దానిని ఆశించటం చేత, కోరికలు ప్రారంభమైనాయి. అప్పుడు రాముడు, ఆమెకు దూరమయ్యాడు. **"కాముడున్న చోట రాముడు, రాముడున్నచోట కాముడు ఉండుట వీలుకాదు. అంధకారము, ప్రకాశము ఒకే స్థానమునందు, ఒకే కాలములో ఉండుటకు వీలు కాదనే విషయం ఋజువైంది"** అని అంటారు భగవాన్‌బాబా. కనుక కాముడు రాక్షసుడు, రాముడు భగవంతుడు. అందువలన రామసేవ చేయాలిగాని, కామసేవ చేయరాదు, రామసేవ చేస్తే తరిస్తారు, కామసేవ చేస్తే కష్టాలు కోరితెచ్చుకుంటారు.

## కింకరుడు- శంకరుడు

**"సేవకుడు కానివాడు నాయకుడు కాలేడు, కింకరుడు కానివాడు శంకరుడు కాలేడు"** అని భగవాన్ బాబా చక్కగా చమత్కరించారు. ఇది చమత్కారం కాదు, వాస్తవం కూడాను. పైకి చమత్కారంగా కనిపించినా, దీనిలో ఎంతో నిగూఢమైన అర్థం యిమిడివున్నది. దేశసేవకుడు అధికారంలోనికి వస్తే, నిస్వార్థసేవ చేస్తాడు. అయితే ఈనాడు ఏమాత్రం సేవచేయకుండా, అధికారమును హస్తగతం చేసుకోవడానికి, అనేక అక్రమ, అనాచార, అవినీతి మార్గములను అనుసరిస్తున్నారు. ప్రజలకు ఏమాత్రం సహాయం చేయకుండానే, అడ్డదారుల ద్వారా అందలం ఎక్కాలని ప్రయత్నిస్తున్నారు. పదవిని పొందడానికి ధనమును విచ్చలవిడిగా ఖర్చుపెడుతున్నారు. అధికారం చేజిక్కించుకొనిన తరువాత, ఎన్నికలలో ఖర్చుచేసిన సొమ్ముకు కనీసం రెట్టింపు సంపాదించడానికి అనేక అవినీతి మార్గముల ననుసరిస్తున్నారు. అభ్యుదయ కార్యక్రమాలకు ఖర్చుపెట్టవలసిన సొమ్ములో అధికభాగం వ్యక్తుల జేబులలోనికి పోతున్నది. అందువలన ఆశించిన ప్రగతి కనిపించటంలేదు. దేశ ఆర్థిక వ్యవస్థ అవస్థలలో పడిపోతున్నది. అందువలన

ప్రజలు విజ్ఞతను ప్రదర్శించాలి. సేవకునికి మాత్రమే అధికారం వప్పచెప్పాలి. సేవలో ఉన్నది పవిత్రత. సేవద్వారానే ప్రేమ అనుభూతిలోనికి వస్తుంది. సేవ ద్వారా భగవంతుని మెప్పను కూడా పొందవచ్చును. సేవచేసి లక్ష్మి తరించింది. సేవకుడుగా, నమ్మిన బంటుగా హనుమంతుడు ప్రశంసలనందుకున్నాడు. సేవను గురించి ఉపన్యాసాలు చెప్పటం కంటే, సేవచేసి చూపించటంలోనే వున్నది గొప్పతనమున్నదంటారు బాబా. కనుక **"సమాజసేవే సర్వేశ్వరుని సేవ, మానవసేవే మాధవసేవ"**. దీనిని విస్మరించకండి. సేవచేయండి! తరించండి!

## కీర్తనం - సంకీర్తనం

**"కీర్తనం సాధకుని పవిత్రంగావిస్తుంది. విష్ణుకీర్తనం విశ్వాన్నే తరింపజేస్తుంది. సంకీర్తన విశ్వశ్రేయస్సును కోరి చేసే సమిష్టి ప్రార్ధన"** అని భగవాన్ బాబావారు చెబుతూ ఒకవ్యక్తి పాడేపాటను **'కీర్తన'** అంటారు. కీర్తన వ్యక్తిగతమైన భగవత్ప్రార్థన. **'సంకీర్తన'** అనగా భగవంతుని లెస్సగా కీర్తించడం, పదిమంది కూడి ఏక కంఠంతో హృదయమును కరిగించే విధంగా సంకీర్తన చేయటం, భగవంతుని కీర్తిని ప్రకటించటమంటారు బాబా. **"సమ్యక్ కీర్తనం సంకీర్తనం"** అన్నారు పెద్దలు. కీర్తన పాడేటప్పడు కేవలం పెదవులనుండి, గొంతునుండి వాక్యములు వెలువడుతాయి. హృదయమునుండి కరగి, కదలి, స్వేచ్ఛతో, ఆనందంతో, భయభ్రాంతులు లేకుండా గావించుదానినే 'సంకీర్తనం' అన్నారు. ఈ సంకీర్తన నాలుగు విధములు. **1. గుణసంకీర్తన 2. లీలాసంకీర్తన 3. భావసంకీర్తన 4. నామసంకీర్తన.** భగవంతుని గుణగణములను వర్ణించుట కంటే : లీలలు గానం చేయటం కంటే, తత్త్వములను, భావములను కీర్తించుటకంటే, నామమును ఉచ్ఛరించటమే పవిత్రమైనది. ఒకే నామమును అందరూ ఒకేసారి ఉచ్ఛరించినప్పడు, దైవత్వమనే ప్రకాశము అందరియందూ వెలుగుతుంది. కనుక పై నాలుగింటిలో **'నామసంకీర్తన'** ఉత్తమమైనదన్నారు బాబా.

## కృషి - కృప

"మానవుని కార్యసిద్ధికి వ్యక్తి కృషి, దైవకృప రెండూ అవసరమే. కృషి, కృప రెండూ నెగిటివ్, పాజిటివ్ వంటివి. దైవకృపవుండినప్పటికీ మానవుని కృషి సరిగాలేకున్న కార్యసిద్ధి జరుగదు" అంటారు భగవాన్‌బాబా. కనుక ప్రతి వ్యక్తి శక్తివంచన లేకుండా 'కృషి' చేయాలి. 'కృషితో నాస్తి దుర్భిక్షం' అన్నారు గదా! కృషి లేకుండా విద్యార్థి పరీక్షలలో ఉత్తీర్ణుడు కాలేడు. కృషి లేకుండా రైతు పంటను పండించలేడు. అసలు వ్యక్తి ఏ

రంగంలో విజయం సాధించాలన్నా 'కృషి' ఉండాలి. అయితే వ్యక్తి 'కృషి' వుండినప్పటికీ 'దైవకృప' లేకపోతే కార్యసిద్ధి చేకూరదు. పాజిటివ్, నెగిటివ్ రెండూ కలిసినప్పడే బల్బువెలుగుతుంది. అదేవిధంగా మానవకృషికి, దైవకృప తోడైనప్పడే ఆశించిన ఫలితాలు చేకురుతాయి. కేవలం ధనబలం, భుజబలం వలననే కార్యాలు సాధించబడవు. దానికి దైవబలం కూడా తోడుకావాలి. అప్పడే కార్యసిద్ధి అవుతుంది. కనుక మనవంతు కృషి మనం చేసి, దైవకృప కోసం, దైవానుగ్రహం కోసం తగిన సాధనలు చేయాలి. అప్పడే విజయం లభిస్తుంది.

## కృష్ణునివాక్కు - రాముని క్రియ

**"కృష్ణుని వాక్కును పవిత్రంగా, ఆదేశంగా మనం స్వీకరించాలి. రాముని క్రియను పవిత్రంగా భావించి ఆచరించాలి. రాముడు ధర్మాన్నిచేసి (ఆచరించి) చూపించాడు. కృష్ణుడు చెప్పి చేయించాడు. కనుక రాముడు చేసినట్లు చేయండి. కృష్ణుడు చెప్పినట్లు చేయండి"** అని హితవు పలికారు భగవాన్‌బాబా. రామావతారమందు తాను అనుభవించి, ఆనందించి, అన్యులకు, ఆదర్శమును అందిస్తూ, సామాన్య మానవుని వలె ప్రవర్తిస్తూ, తన ఆచరణ ద్వారా దైవత్వాన్ని ప్రకటిస్తూ వచ్చాడు 'శ్రీరాముడు'. కృష్ణుడు అట్లాకాదు. ఆదేశంగా తాను తీసుకొని, బోధించటంలో మానవత్వానికి తగినటువంటి విశిష్టతను కల్పించాడు కృష్ణుడు. కనుకనే రాముడు చేసినట్లుచేయి! కృష్ణుడు చెప్పినట్లు చేయమంటూ, కృష్ణుడు చేసినట్లు చేస్తే దెబ్బలు పడుతాయని చమత్కరించారు బాబా. అనగా కృష్ణుడు అల్లరి చేసినట్లుగా మనం కూడా చేస్తే వీపులు చిట్లుతాయన్నమాట. కృష్ణుడూ, రాముడూ ఒకే విష్ణు తత్త్వమైనప్పటికీ ఆయా యుగకాలమాన పరిస్థితుల ప్రభావములను పురస్కరించుకొని ప్రవర్తిస్తూ వచ్చారని బాబా పేర్కొంటూ **"శ్రీరాముడు కాలుత్రొక్కించుకొని కయ్యమునకు వెళ్ళాడు. కాని కృష్ణుడు కాలు త్రొక్కి కయ్యాన్ని తెచ్చుకున్నాడు. రాముడు స్త్రీ నిమిత్తమై పరితపిస్తూ వచ్చాడు. కాని కృష్ణుడు స్త్రీలను ఏడిపించాడు. రామునికి పనిముందు, తరువాత నవ్వు. కృష్ణునికి నవ్వు ముందు, తరువాత పని, కనుకనే రామునకు, కృష్ణునికి చర్యలయందు పూర్తిగా విరుద్ధం కనిపిస్తుంది. కారణమేమనగా ఆ దేశకాల ప్రభావములను పురస్కరించు కొని వారు ఆ విధంగా ప్రవర్తించారు"** అని బాబా చెప్పారు. కనుక ఆయా అవతారముల విశిష్టతను, ప్రత్యేకతను అవగాహన చేసుకుంటే, అర్థమవుతుంది అంతరార్థం.

## కోऽహం - సోऽహం - దాసోహం

బిడ్డపుట్టిన తక్షణమే 'క్వా', 'క్వా' అని ఏడుస్తుంది. ఎక్కడ? ఎక్కడ? అని దీని అంతరార్థం. తరువాత కొంతకాలానికి **"కో2హం?... కో2హం?...** అని

ఏడుస్తుంది. అనగా నేనెవరు?... నేనెవరు? ... అని అర్థం. చచ్చేంత వరకు **'కో2హం?.. కో2హం?..** అంటూ పోతే ఏమి ప్రయోజనం? పుట్టేటప్పుడు 'క్వా'-- 'క్వా'? అంటూ పుట్టావు కొంతకాలానికి 'కో2హం' 'కో2హం' అని ఏడుస్తావు. చచ్చేటప్పుడు **'సో2హం'** అంటూ చచ్చినవాడికే నిజమైన ముక్తిలభిస్తుంది. కనుక **'కో2హం' నుంచి 'సో2హం'కు ప్రయాణం చేయాలి' 'దా2సోహం' లేకుండా 'సో2హం'** అనేటటువంటి దానిని అనుభవించుటకు, వీలుకాదు. 'సో2హం' అంటే ఆ సచ్చిదానంద పరబ్రహ్మమే నేను. ఆత్మనే నేను. ఆ ఆత్మనే ప్రేమ. ఆ సో2హం ప్రేమ. అసలు ఆ ప్రేమ ఎక్కడ పుడుతుంది? ఎక్కడ అంత్యమవుతుంది? **'దాసో2హం'** నుంచి ప్రారంభమై **'సో2హం'** అనేటటువంటి దాంతో ఈ ప్రేమ అంత్యమవుతుంది. ఆ ఆత్మనే బ్రహ్మ. భ్రాంతిలో మునిగివున్నంత వరకు 'బ్రహ్మ' మనకు అర్థం కాదు. భ్రమలో ఉన్నంతవరకు బ్రహ్మ మనకుచిక్కడు. భ్రమను దూరం చేసినప్పుడే 'బ్రహ్మ' మనకు చిక్కుతాడు. అతనిని ఎక్కడో వెదకనవసరంలేదు. తనయందే సాక్షాత్కరిస్తాడు" అని భగవాన్ సాయి దివ్యబోధ చేశారు. ఆత్మనే ప్రేమ. భగవంతుడు ప్రేమస్వరూపుడు. కనుక మీ పడవను ప్రేమవైపుకు ప్రయాణం చేయించండి. గమ్యాన్ని చేరుకోగలుగుతారు, పుణ్యాన్ని పొందుతారు. ముక్తిని సాధిస్తారు.

## గంగదేకులం - గాలిదేకులం

**"మా కులం... మా కులం.. మీ కులం ఏ కులం? గంగదేకులం? గాలిదేకులం? నిప్పదే కులం? వీటికి కులాలే లేవే? కనుక మన కులం మానవకులం. మన జాతి మానవ జాతి. అందరూ మానవులే. ఈ సత్యాన్ని మనం గుర్తించాలి. దేహాన్నిబట్టి - ఈ కులాలు. మతాలు, తెగలు, వర్ణాలు వచ్చాయిగాని, నిజంగా ఆత్మకు ఎట్టికులం లేదు. ఉన్నది ఒకే కులం. అదే మానవత్వం. అదే దివ్యత్వం, అదే దైవత్వం"** అని అంటారు భగవాన్‌బాబా. కులపిచ్చితో క్రుమ్ములాడుకుంటున్న ఈ రోజులలో, మతం పేరిట మారణహోమాలు జరుగుతున్న ఈ దుర్దినాలలో, బాబావారి సందేశం ఆలకించి, ఆచరిస్తే నిజంగా జాతీయ సమైక్యతను సాధించినవారమవుతాం. మెతుకులను చూచిన కాకి, అంతా తానే తినదు. 'కా..కా..' అని పదికాకులను చేరుస్తుంది. అదేవిధంగా బెల్లపుగడ్డను చూచిన చీమ అంతా తానే తినదు - వందలాది చీమలను చేర్చి దానిని తీసుకొని వెళ్ళుతాయి చీమలు. **"కాకులలో, చీమలలో ఉన్నది ఐకమత్యం కాని ఈనాటి మానవులలో మాత్రం కనిపించటం లేదు"** అని తన ఆవేదనను వెలిబుచ్చుతూ బాబా ఈ సందేశం యిచ్చారు.

"మతములన్నియు వేరు, మార్గమొక్కటె
వస్త్రభేధములు వేరు, వస్తువొక్కటె
శృంగారములు వేరు, బంగారమొక్కటె
పశువు వన్నెలు వేరు, పాలు ఒక్కటె
జీవజాతులువేరు, జీవుండుఒక్కడె
జాతినీతులు వేరు, జన్మంబు ఒక్కటె
దర్శనంబులు వేరు, దైవంబుఒక్కడె
పూలజాతులువేరు, పూజ ఒక్కటె
తెలియలేకను మానవుల్ తెలివి తప్పి
బ్రతుకు కోసము బహుబాధ బద్ధులైరి"

అన్నారుబాబా. బాబా ఆలోచనలను ఆచరణలో పెట్టినప్పుడు మానవుని మధ్యనున్న భేదభావములు పైదొలగిపోయి, విశ్వశాంతికి దోహదం చేసిన వారమవుతాం.

## గాయత్రి - సావిత్రి - సరస్వతి

'తెలివి తేటలను అభివృద్ధి పరచునప్పుడు ఈమె 'గాయత్రి'. ప్రాణములను రక్షించునప్పుడు ఈమె 'సావిత్రి'. వాక్కును కాపాడునప్పుడు ఈమె 'సరస్వతి'. గాయత్రి, సావిత్రి, సరస్వతి పేర్లతో ఆయా సమయములయందు బుద్ధిని, ప్రాణమును, వాక్కును రక్షించేది గనుక గాయత్రి సర్వదేవతా స్వరూపిణి' అని అంటారు భగవాన్‌బాబా. "గాయత్రీ ఛందసాం మాతః" గాయత్రి అనగా సర్వవేదములకు మాతృస్వరూపిణి. 'గాయ' అనగా జీవుడని అర్థము. జీవులను పోషించేది, ప్రాణములను రక్షించేది 'గాయత్రి' అని కూడా దీనికి అర్థము. గాయత్రీ మంత్రోపదేశ సంస్కారం జరిగిన తరువాత 'ద్విజుడు' గా రూపొందుతాడు. గాయత్రి మంత్రం సర్వదేవతా స్వరూపము. ఇది ఒక మతమునకుగాని, ఒక కులమునకుగాని, లింగస్థాయి భేదములకుగాని సంబంధించినది కాదంటారు బాబా. అంతేకాదు కనీసం ఉదయం మూడు సార్లు, సాయంత్రం మూడుసార్లు గాయత్రి మంత్రమును ప్రతిదినం ఉచ్చరించడం వలన మన కర్మల శేషము మనలను ఏమాత్రం బాధించకుండా వుంటుందంటారు బాబా. "గాయత్రి, సావిత్రి, సరస్వతి" అని మూడు కాలములయందు మూడు పేర్లు ధరించి, మూర్తీభవించిన దేవి ఈ "గాయత్రి" అని చెప్పారు భగవాన్‌బాబా.

## చితి - చింత

"దహ్యాతీతిదేహః" దహించబడునది దేహము. కేవలం మరణించిన తరువాత దహింపబడునదేకాదు. జీవించి వున్నప్పడే దహించ బడుతుంది ఈ దేహము. **ఈ దేహమును మరణించిన తరువాత 'చితి' దగ్ధంగావిస్తే, జీవించి ఉన్నప్పడు చింత దహింపజేస్తుంది** అని అంటారు భగవాన్ బాబా. అనగా జీవంలేని కాయమును కట్టెలు దహించివేస్తే, జీవంవున్న శరీరమును 'కోరికలు' దహించి వేస్తాయి. కనుక కోరికలను తగ్గించుకున్నప్పడే మనశ్శాంతి చేకూరి సుఖపడుతారంటారు బాబా. అయితే ఈనాడు కోరికలు విపరీతంగా పెరిగిపోవటం వలన, సంతృప్తి లేకుండాపోతుంది. చింత పెరుగుతున్నది, మనశ్శాంతి లేకుండా పోతున్నది. కనుక మనం ఈనాడు పెంచుకోవలసింది 'చింత' కాదు, 'చింతన' పెంచుకోవాలి. అనగా 'దైవచింతన' పెంచుకొని తరించాలి.

## తృష్ణ - కృష్ణ

ఈనాడు మానవులలో 'తృష్ణ' ఉంటున్నది కాని 'తృప్తి' ఉండటంలేదు. 'తృష్ణ' అనగా నిముషనిముషానికి కోరికలు అభివృద్ధికావటం. ఈ 'తృష్ణ'ని మనం అనుసరించకూడదు. కృష్ణను అనుసరించాలి. ఈ కృష్ణని అనుసరించినప్పడే మనకు అన్నివిధాలా మంచి చేకూరుతుంది. భగవంతుని నామాన్ని ఉచ్ఛరించండి! భగవంతుని ఆజ్ఞలను ఆచరించండి! అప్పడే మనిషికి తృప్తి, మనసుకు ఆనందం **"కనుక తృష్ణను దూరం చేయండి! కృష్ణను మీలో చేర్చుకోండి! కృష్ణకు స్వాగతం పలకండి! తృష్ణకు కాదు. ఇదే ఈనాడు గ్రహించవలసిన కృష్ణతత్త్వము"** అన్నారు భగవాన్ సాయి. కనుక ఈ లోకంలో అమితమైన కోరికలు గలవాడే బీదవాడు. సంతృప్తిగలవాడే ధనవంతుడు. తృప్తి గలవాడే నిజమైన శాంతిపరుడు.

## త్యాగరాజులు - భోగరాజులు

**"త్యాగరాజులు కాండి! భోగరాజులు కాకండి! మీ జీవితాలను సార్థకం చేసుకొనండి! మీరు విన్నవి, కన్నవి ఏ ఒకటి రెండైనను ఆచరణలో పెట్టి, ఆదర్శవంతమైన దానిని లోకానికి అందించండి"** అని హితబోధ చేశారు భగవాన్ బాబా. 'త్యాగరాజు' అని పేరు పెట్టినందుకు అతనిలో నిజంగా పేరుకు తగిన త్యాగం వుందని చెబుతూ ఒక చక్కటి ఉదాహరణ ఆయన జీవితంలో నుంచి చెప్పారు బాబా. ఒకసారి తంజావూరు రాజా అనేక బంగారు ఆభరణాలు, నిత్యజీవితావసర వస్తువులు త్యాగరాజుకు పంపగా, వాటిని తిరస్కరిస్తూ **"నిధి చాల సుఖమా? ఈశ్వరసన్నిధి చాలా**

సుఖమా? నిజముగ తెలుపుము మనసా!" అన్నాడు. అంతేకాదు. "ఓ రామా! నీపాదద్వందములను నారెండు హస్తాలతో గట్టిగా పట్టాను. నీవు ఏదో ప్లాను వేస్తున్నావు. ఈ వైభవములు, యీ సిరిసంపదలు నా హస్తములలో పెట్టి నీవు తప్పించుకోవాలని చూస్తున్నావా? వీటిని స్వీకరించాలంటే నీ పవిత్ర పాదాలను నేను వదలాలి గదా! వీటి కోసం నా చేతులు పట్టాలిగదా! ఈ అశాశ్వతమైన వాటికోసం నాచేతులను చాచను. శాశ్వతమైన పవిత్రమైన నీపాదములను వదలను. నన్ను విడచి వెళ్ళవద్దయ్యా? నిన్ను విడచి నేను వుండలేను. నీ పాదములను నేను వదలనురా! అని అంటాడు త్యాగరాజు. త్యాగంలోనే వున్నది ఆనందం. భోగంలో వున్నది రోగం. అందువలననే "త్యాగేనైకే అమృతత్వ మానశుః" అన్నారు మన ఋషులు.

## దమ్మత - దానము - దయ

"దమ్మత, దానము, దయ - ఈ మూడూ మనం అలవరచుకోవలసిన ఆవశ్య గుణాలు. వీటినే 'ద' కారత్రయమని వేదాంత పరిభాషలో అంటారు. 'దమ్మత' అంటే ఇంద్రియనిగ్రహం. మనలో దైవత్వం ఉంది, మానవత్వముంది, దానవత్వం కూడా ఉంది. దానవత్వం నుండి మానవత్వానికి ఎదగాలంటే 'దయ'ను అలవరచుకోవాలి. మానవత్వం నుండి దైవత్వానికి పెరగాలంటే 'దానం' చేస్తూ వుండాలి. దైవత్వం నుండి ఏకత్వానికి చేరుకోవాలంటే 'దమ్మత' (ఇంద్రియనిగ్రహం) పాటించాలి" అని అంటారు భగవాన్ బాబా. కనుక దేవతలకు 'దమ్మత', (ఇంద్రియనిగ్రహం), మానవులకు 'దానం', దానవులకు 'దయ' ముఖ్యంగా వుండాలి. అప్పడే వారు ఉన్నస్థితినుంచి ఉన్నత స్థితికి ఎదగ గలుగుతారు.

## దయ - ధనం

'ధనము' అనేది కాలికి తొడిగే చెప్పవంటిది. చెప్ప పెద్దది అయితే నడువ లేదు. చిన్నదైతే అది కాలును కరుస్తుంది. సరిపోయే సైజువుండాలి. మితిమీరితే మతిహాని కలిగిస్తుంది. మన ప్రాచీనులు 'ధర్మమూలమిదంజగత్' అని విశ్వసించారు. ఇప్పటివారు 'ధనమూలమిదంజగత్' అని భావిస్తున్నారు. కాని ప్రస్తుత పరిస్థితులలో 'దయామూల మిదంజగత్' అవసరం. ఈనాడు మనం ఉద్ధరించ వలసింది దయనేగాని ధనమునుకాదు. అయితే ఈనాడు మానవునిలో 'దయ' అనేది కనిపించటంలేదు. నిర్దయులుగా తయారవుతున్నారు. "దయకు దూరమవుతున్నారు, ధనమునకు దగ్గరఅవుతున్నారు" అని భగవాన్ సాయి తన బాధను వ్యక్తం చేశారు. కనుక దయను పెంచుకోవటానికి 'ప్రేమ' ఒక్కటే రాజమార్గమంటారు స్వామి.

## దక్షిణ - ప్రదక్షిణ

'దక్షిణ' అంటే గురువుగారికి సమర్పించుకునే కానుక అని, 'ప్రదక్షిణ' అంటే దేవాలయంచుట్టూ తిరగటమని చాలా మంది భావిస్తుంటారు అయితే భగవాన్ బాబావారు ఈ రెండు పదాలకు చక్కటి నిర్వచనం చెప్పారు. 'దక్షిణ' అంటే డబ్బు సమర్పించుకోవటం కాదు. మీ ప్రేమను అందించటమే 'దక్షిణ'. ప్రదక్షిణ' అంటే దేవాలయం చుట్టూ తిరగటం కాదు. సర్వత్రా ఉన్నటువంటి భగవంతుడు ఒక్కడే అని తెలుసుకోవటమే 'ప్రదక్షిణ' అని చెబుతూ ఈ రెండు తత్త్వాలను మనం చక్కగా గుర్తించుకుంటే నిత్యమూ గురు పూర్ణిమే, సర్వమూ గురుత్వమేనని చెప్పారు బాబా. శిష్యులందరిని చేర్చుకొని, పాదపూజలు చేయించుకోవడం, ప్రదక్షిణలు చేయించుకోవడం, దక్షిణలు తీసుకోవడం గురుపూర్ణిమ లక్షణం కాదని స్పష్టం చేశారు బాబా. 'గురుపూర్ణిమ' అనగా పూర్ణమైనటువంటి చంద్రుడు. అనగా ఎట్టి మచ్చలూ లేకుండా ఉండేటటువంటివాడు. చంద్రుడనగా మన మనస్సే. ఈ మనస్సు పరిపూర్ణమైనదిగా ఉన్నప్పుడు అదే 'గురుపూర్ణిమ' అన్నారు.

## దక్షుడు - రక్షకుడు - శిక్షకుడు

**"దక్షుడు, రక్షకుడు, శిక్షకుడు - ఈ ముగ్గురూ పరిపాలనలో ప్రధానమైన స్థానమును అలంకరిస్తున్నారు"** అని చెప్పారు భగవాన్ బాబా. దక్షతతో ఉత్పత్తి చేసేవాడు 'దక్షుడు'. ఈ ఉత్పత్తిని సంరక్షించేవాడు 'రక్షకుడు'. వీరు ముగ్గురు ముక్కాలి పీటకుండే మూడు కాళ్లవంటి వారు. కేవలం మూడు కాళ్ళు వున్నంత మాత్రమున వాటి మీద కూర్చోవడానికి వీలుకాదుగదా! వాటి మీద అమర్చే చెక్క 'ప్రేమ'. ఆ చెక్కను మూడు కాళ్లమీద పెట్టి మూడు స్క్రూలను బిగించినప్పుడే ఆ ముక్కాలి పీట కదలకుండా ఉంటుంది. ఆ మూడు స్క్రూలే సత్యం, త్యాగం, క్షమలు. ఈ ముక్కాలి పీటమీదనే సమాజం నిలుస్తుంది. ఉత్పత్తిదారులు ప్రజలను ప్రేమించాలి. సమాజమే లేకపోతే ఉత్పత్తి నిరుపయోగమవుతుంది. సమాజమును రక్షించే నిమిత్తమై రక్షకులను ఏర్పర్చినారు. సమాజాన్ని రక్షకులు కూడా ప్రేమించాలి. ఇకపోతే సంపదను దుర్వినియోగం పరచేవారిని శిక్షించడానికి శిక్షకులు కూడా కావాలి కదా! కనుక ఈ ముగ్గురూ ప్రేమతో, ఏకీభావంతో, సమాజశ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని ప్రవర్తించటమే 'దేశభక్తి' అని భగవాన్ చక్కగా వివరించారు. మాతృభక్తికి ఎంత ప్రాముఖ్యత యిస్తున్నామో, మాతృదేశభక్తికి కూడా అంతే ప్రాముఖ్యత యివ్వాలి. ఈ దేశం నాకేమిచ్చింది? అనేదానికన్నా ఈ దేశం కోసం నేనేమిచేశాను? అని ప్రతి పౌరుడు ప్రశ్నించుకొని తన విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించాలంటారు బాబా. కనుక ఉత్పత్తిని పెంచడం ప్రతిఒక్కరి కర్తవ్యం. దేశాన్ని రక్షించడం ప్రతి ఒక్కరి బాధ్యత.

## దాంతులు - వేదాంతులు

"ఈనాడు లోకానికి దాంతులు కావాలి గాని వేదాంతులు అక్కరలేదు." అని చమత్కరించారు భగవాన్ సాయి. ఇంద్రియనిగ్రహమునకు సంస్కృతమందు 'దమము' అని పేరు. ఈ దమమును సాధించినవాడు 'దాంతుడు'. అయితే ఈనాడు దాంతులు కనుమరుగైపోతున్నారు, వేదాంతులు పెరిగిపోతున్నారు. ఈనాడు వేదాంతం మాటలకే పరిమితమైపోతున్నది. ఆచరణ వ్యర్థమైపోతున్నది. వాచాలత్వం అధికమైపోతున్నది, ఆడంబరాలు పెరిగిపోతున్నాయి. ఆచరణ శూన్యమైపోతున్నది. ఆచరణ లేని వేదాంతం వలన ప్రయోజనంలేదు. ఆచరణలేని మెట్ట వేదాంత ఉపన్యాసాలు, ప్రసంగాలతో సమాజంలో పరివర్తనను తీసుకొని రాలేము. కనుక ఈనాడు ఇంద్రియాలను జయించిన 'దాంతులు' కావాలిగాని వాచాల వేదాంతులుకాదు.

## దీనత్వం - హీనత్వం

"దానము చేయక పోవటం చేత మానవుడు దీనుడై మరల జన్మిస్తాడు. ఈనాటి మానవుని యందున్న హీనత్వానికిగాని, దీనత్వానికిగాని, తనకు కలిగిన సంపదలో అంతో ఇంతో, ఇతరులకు అందించకపోవటమే కారణము" అని అంటారు భగవాన్ బాబా. 'అదానదోషేణ భవేద్దరిద్రః' అన్నాయి ఉపనిషత్తులు. దానం చేయకపోవటం చేతనే జీవుడు దరిద్రుడై మరల జన్మిస్తాడు. 'దేయం దీనజనాయ చ విత్తం' దీనులకు, దరిద్రులకు తనకున్న దానిలో కొంతయిచ్చి సహాయం చేయటం మంచిదని శాస్త్రములు చెబుతున్నాయి. కనుక ప్రతివ్యక్తి తాను సంపాదించిన సంపదలో కొంతభాగం దానధర్మములకు, సత్కార్యములకు కేటాయించాలి. పశుపక్ష్యాదులకు కూడా పెట్టాలి. దానధర్మములకు వినియోగించు ద్రవ్యము ఇహమునందును, పరమునందును తిరిగివస్తుంది. స్నేహితుల కొరకు వినియోగించు ద్రవ్యము ఇహమునందు మాత్రమే తిరిగి వస్తుంది. భోగముల కొరకు దుర్వినియోగం చేయు ద్రవ్యము, ఇహమునందుగాని, పరమునందుగాని తిరిగిరాదు. కనుక ఈ ధర్మసూక్ష్మమును గ్రహించి తాను సంపాదించిన సంపదలో కొంత భాగం దానధర్మములకు, సత్కార్యములకు వినియోగించాలి. లేకపోతే హీనమైన, దీనమైన జీవితాన్ని భవిష్యత్తులో గడుపవలసివస్తుంది.

## దీర్ఘజీవితం - దివ్యజీవితం

"మానవుడు ఈనాడు ఆశించవలసింది దీర్ఘజీవితం కాదు, దివ్యజీవితాన్ని

ఆశించాలి. పొడిగించుకోవలసింది జీవితం కాదు. గుణాన్ని పొడిగించుకోవాలి. పొడిగించుకొనే జీవితం కాలాధీనం. బలపరచుకోవలసింది గుణం. వ్యక్తి యొక్క క్రియాశీలత అంతా గుణములపైననే ఆధారపడి వుంటుంది. ధనం కాదు ప్రధానం, గుణం ప్రధానం. గుణం కంటే మించిన బలం వేరొకటి లేదు. ధనపోషణ ముఖ్యంకాదు, గుణపోషణ ముఖ్యం. గుణహీనులు కావటంవలననే రావణుడు, దుర్యోధనుడు తమ తమ వంశములను గూడా సర్వనాశనం గావించుకున్నారు. ధనబలం, జనబలం సర్వబలాలు వున్నప్పటికీ; గుణబలం, దైవబలం కనుక లేకపోతే జీవితసమరంలో ఓడిపోవటం ఖాయం" అన్నారు భగవాన్ బాబా. కనుక కాకిలా చిరకాలం జీవించటం కంటే, హంసలా కొద్దికాలం బ్రతికినా చాలు" పదిమందిలో శభాష్! అనిపించుకొనే విధంగా మన ప్రవర్తన వుండాలి. సమాజం చేత వ్రేలుపెట్టి చూపించుకొనే స్థితికి దిగజారరాదు. "మానవజీవితం దీర్ఘప్రయాణం. ఈ దీర్ఘ ప్రయాణంలో దివ్యజీవితాన్ని గడపాలిగాని, దీన జీవితాన్ని గడుపరాదు" అని అంటారు భగవాన్ బాబా.

## ధీరుడు - దీనుడు

"నిరంతరం రామనామం స్మరించే హనుమంతుడు రావణుని దగ్గరకు వెళ్ళినప్పుడు 'ధీరుడు' అయినాడు. అదే 'ధీరుడు' శ్రీరాముని వద్దకు వచ్చినప్పుడు 'దీనుడు' అయినాడు. అనగా దివ్యత్వం దగ్గర 'దీనుడు', అహంకారం దగ్గర 'ధీరుడు' అయ్యాడు" అని భగవాన్ బాబా చెబుతూ అహంకారి దగ్గర మనం ఎప్పుడూ 'ధీరులు'గానే వుండి, ఆ అహంకారమును నిర్మూలనం గావించాలంటారు బాబా. కనుక చెడ్డవారి ముందర 'ధీరుడు'గా నిలబడాలి. మంచివారి ముందర 'దీనుడు'(వినయశీలి)గా తలవంచాలి.

## దొడ్డబుద్ధి - గొడ్డుబుద్ధి

మనం ఎక్కడపుట్టామో అక్కడకు పోవాలి. మనం ఎక్కడనుండి ఈ కాలేజీకి వచ్చామో, మరల మన ఇంటికి పోవాలిగదా! ఏ మూలస్థానమునుండి వచ్చామో, ఆ స్వస్థానానికి జేరే త్రోవ వెదుక్కోవాలిగదా! ఎందుకు వెదుక్కోవలసి వచ్చిందంటే మరచిపోయాము గనుక. ఈ క్షణభంగుర జీవనసుఖాలలో, ఈ ప్రాకృత సంబంధాలలో మునిగి నిత్యమైన సత్యమైన దివ్యత్వాన్ని మనం మరచి పోయినాం. అందువలన "అయ్యో! నీవు వచ్చిన స్వస్థానమును మరచిపోయినావు. ఎంతకాలం ఈ పరస్థానంలో ఉంటావు? ఎంతకాలం ఈ క్యాంపులో కాలక్షేపం చేస్తావు? తిరిగి నీ స్వస్థానానికి చేరుకో!" అని జీవునికి వేదాంతం హెచ్చరిస్తున్నది.

"త్రోవ వెదుకుకొనుట దొడ్డ బుద్ధి, త్రోవ మరచేది గొడ్డు బుద్ధి ఈనాడు మనం గొడ్డు బుద్ధితో జీవిస్తున్నాం. దొడ్డ బుద్ధికి ప్రయాణం కావాలి'అంటారు భగవాన్ బాబా. కనుక అనిత్యమైన ఈ జగత్తును వదలి, నిత్యమైన, సత్యమైన అమృతత్త్వంలో చేరాలి. ఐతే ఈనాడు అమరమైన అమృతత్త్వాన్ని మరచి అనమృతత్త్వంలో మునిగి అనేక అశాంతులకు బలియైపోతున్నాం. సర్వవేళలా సదాలోచనలతో, సచ్ఛింతనలతో, సద్బుద్ధితో కాలం గడపటం 'దొడ్డబుద్ధి ' లక్షణం. దురాలోచనలతో, దుశ్చింతనలతో, దుర్బుద్ధితో కాలం గడపటం 'గొడ్డుబుద్ధి' లక్షణం. కనుక ప్రతిఒక్కరూ 'దొడ్డబుద్ధి' ని పెంచుకొని, 'గొడ్డుబుద్ధి'కి స్వస్తి పలకాలి.

## దోషములు - క్లేశములు

"మానవుడు 16 దోషములు, 5 క్లేశముల చేత కప్పబడటంవలన తాను తానుగా ప్రకాశించలేకపోతున్నాడు. తనను తాను తెలుసుకోవటమే నిజమైన తత్త్వము" అని చెబుతూ భగవాన్ బాబావారు దోషములు, క్లేశములను వివరించారు. కుల, బల, యౌవన, సౌందర్య విద్య, ధన, తపో, రాజ్య మదములు-ఎనిమిది. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే అరిషడ్వర్గములు-ఆరు. మరియు రజో, తమోగుణములు- రెండు. మొత్తం 16దోషములు. ఇకపోతే క్లేశములు - ఐదు. 1. అవిద్యాక్లేశము 2. అభినవక్లేశము 3. అస్థితక్లేశము 4. రాగక్లేశము 5. ద్వేషక్లేశము. ఎన్ని సాధనలు సలిపినా మనస్సులో మాలిన్యం తొలగించుకొనని యెడల ప్రయోజనం లేదు. మాలిన్యం వైదొలగి, మనస్సు నిర్మలంగా ఉండాలంటే, సత్సంగమం కావాలి, సత్సాంగత్యం వుండాలి. అప్పడే మన మనస్సులో సత్సంకల్పాలు బయలుదేరుతాయి. సత్సంకల్పాల వలన సంస్కారం అబ్బుతుంది. మనస్సు నిర్మలమవుతుంది. హృదయం పవిత్రమైన భావాలకు నిలయమవుతుంది. అప్పడు ఏ దోషములు, ఏ క్లేశములు మానవుని బాధించవంటారు బాబా.

## నామం - దానం

"కలియుగంలో నామము, దానము- ఈరెండే ప్రధానమైనవి. 'నామము' అంటే దైవనామము. 'దానము' అంటే అన్నదానము. దానములన్నింటిలో ముఖ్యమైనది 'అన్నదానం'. అన్నం పరబ్రహ్మస్వరూపం. బ్రహ్మతత్త్వాన్ని ఈ రూపంలో అనుభవించాలి. నామంలో నామిని దర్శించాలి. జడచైతన్యములు 'రెండు' అవే నామి, నామములు. క్షేత్రం, క్షేత్రజ్ఞుడన్నా; ఆత్మ, అనాత్మన్నా; దేహి, దేహములన్నా ఇవే. ఒకటి చైతన్యము, మరొకటి జడము. ఈ జడచైతన్యములను ఏకం గావించు

కోవటమే మన ప్రధానసాధన. మనం ఏకరూపులమైనప్పుడు దివ్యత్వాన్ని అనుభవిస్తాం" అని చెప్పారు భగవాన్ బాబా. ఇది అత్యున్నతమైన ఆధ్యాత్మికసాధన.

## పరిశీలన - పరిశోధన

ప్రతి విషయంలోను మానవుడు అనుభవించుటకు ముందు చక్కగా విచారణ (Enquiry) సలిపి, పరిశీలన (Investigation) చేయాలి. పరిశీలన జరిపినప్పడే పరిశోధన (Research) కూడా లభ్యమవుతుంది, పరిశోధనా ఫలితాలను వినియోగించుకోవడానికి **'వివేకము'** ఉండాలి. అయితే ఈనాడు విజ్ఞాన శాస్త్రరంగంలో వివేకాన్ని విస్మరిస్తున్నారు. విషయ పరిశోధనకు విజ్ఞానమెంత అవసరమో, పరిశోధనా ఫలితాలను వినియోగించుకోవడానికి **'వివేకము'** అంత అవసరం. పరిశోధన, పరిశీలనలయందు సమత్వంకూడా ఉండాలి. ఈనాడు పరిశోధనలు అధికంగా సాగుతున్నాయిగాని, పరిశీలన మాత్రం సలపటం లేదు. ప్రతివిషయాన్ని మొదట చక్కగా విచారణ సలిపి, తరువాత శ్రద్ధగా పరశీలన చేసి, పరిశోధనచేయాలి. పరిశోధన ద్వారా లభ్యమైన విజ్ఞానాన్ని వివేకంతో ప్రపంచాభివృద్ధికి వినియోగించాలి. అయితే ఈనాడు వివేకం లోపించింది. **"వివేకం లేని విజ్ఞానం వలన దేశానికి ప్రమాదం"** అని హెచ్చరించారు భగవాన్ బాబావారు. వివేకం లోపించడం వలన ఈనాడు వివిధ దేశాలలో సంపాదించిన అణుపరిజ్ఞానం మారణహోమానికి ఉపయోగపడుతున్నదిగాని మానవ కళ్యాణానికి వినియోగ పడటం లేదు. కనుక ప్రతి ఒక్కరిలో **'పరిశీలనా దృక్పథం'** (Investigation Out Look) పెరగాలి. **'పరిశోధనాదృష్టి'** (Research Out Look) అభివృద్ధి కావాలి. **'వివేకవిజ్ఞానము'** (Discrimination Knowledge) ను పెంపొందించుకోవాలి.

## పరుడు - పరమాత్ముడు

**"పరుడు పరుడు కాదయా! పరమాత్ముడేనయా!"** అన్నారు భగవాన్ బాబా. ఈ విషయం తెలుసుకోలేక పరదూషణ చేస్తున్నారు. పరదూషణ పాపం. పరమాత్మ దూషణ మరింత పాపం. వాడెవడో పరుడని భావించి ఇష్టం వచ్చినట్లు దూషిస్తుంటారు. అతడు పరుడుకాదు పరమాత్ముడే, పరులలో నున్న పరమాత్మ నీలో వున్న పరమాత్మ ఒక్కడే. అంటే నిన్ను నీవే దూషించుకుంటున్నావన్నమాట. అంతేకాదు నీవు ఇతరులను ఎంత దూషించుతావో అంతకు పదిరెట్లు నీవు దూషించబడుతావంటారు బాబా. **"ప్రతి జీవి పరమాత్మ స్వరూపుడే. జగత్తుకంతా నాయకుడతనే. సూత్రధారి, పాత్రధారి కూడా అతనే. సర్వరూపములూ తనవే.**

దూషించేవాడు, దూషించబడేవాడు తానే. పూజించేవాడు, పూజింపబడేవాడు తానే" అని చెప్పారు బాబా. కనుక "సర్వజీవ తిరస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" ఏ జీవిని తిరస్కరించినా, బాధించినా భగవంతుని బాధించినట్లే అవుతుంది. కనుక "నిర్వైరస్సర్వభూతేషు" సమస్త ప్రాణులయందు ద్వేషము లేకుండా వుండవలెను. సమస్త ప్రాణులు భగవత్స్వరూపులేనని, నారాయణ స్వరూపులేనని, పరమాత్మ స్వరూపులేనని, పరులుకాదని భావించాలి. వేదాలు, ఉపనిషత్తులు పురాణాలు ఇటువంటి విశాలభావాన్ని, సమదృష్టిని బోధిస్తున్నాయి. ఇంతకన్నా మించిన సాంఘికన్యాయం (Social Justice) ఎక్కడా కనిపించదు. ఇటువంటి అత్యున్నతమైన తత్త్వ జ్ఞానము (Philosophy) ను భగవాన్ బాబావారు బోధిస్తున్నారు.

## పాపి - గోపి

"అన్నం నిమిత్తం ప్రాకులాడేవాడు 'పాపి'. ఆత్మ నిమిత్తం ప్రాకులాడేవాడు 'గోపి.' "అన్నం మ్రింగడానికి మానవుడు రాలేదు" అని అంటారు భగవాన్ బాబా. కనుక జీవితలక్ష్యం, గమ్యం ఆత్మకావాలి కాని ప్రపంచం కాకూడదు. 'జంతూనాం నరజన్మ దుర్లభం' గదా! 84లక్షల జీవరాసులలో మానవజన్మ ఎంతో ఉత్కృష్టమైనది, పవిత్రమైనది. అయితే ఈనాడు అట్టి పవిత్రమైన మానవ జన్మను నిరర్థకం గావించు కుంటున్నాడు. 'పశుపతి'గా ఎదగవలసినవాడు 'పశువు' గానే నిలిచిపోతున్నాడు. 'మాధవుడి'గా మారవలసినవాడు 'మానవుడు'గానే వుండిపోతున్నాడు. 'నారాయణుడు'గా రూపొందవలసినవాడు 'నరుడు'గానే జీవితం గడుపుతున్నాడు. అదేవిధంగా 'గోపి'గా తరించవలసినవాడు 'పాపి'గానే పతనమవుతున్నాడు. మానవుడు రానురాను దిగజారిపోతున్నాడు గాని పై మెట్టుకు చేరుకోలేక పోతున్నాడు. ఇది మారాలి, మారటానికి తగిన సాధనలు చేయాలి. మానవుడు, మాధవుడుకావాలి. పశువు, పశుపతికావాలి. నరుడు, నారాయణుడు కావాలి. పాపి, గోపి కావాలి. అప్పుడే మన జన్మలు సార్థకమవుతాయి.

## ప్రియం - మోదం - ప్రమోదం

"ప్రతి వ్యక్తి ప్రియం, మోదం, ప్రమోదం - అనే మూడింటిని ఆశిస్తాడు" అని భగవాన్ బాబా చెబుతూ ఇష్టమైన దానిని చూచినప్పుడు కలిగేది ప్రియానందం. ఇష్టవస్తువు విషయానుభవం మోదం. ఇష్టమైన వ్యక్తితో, లేక వస్తువుతో, విషయంతో తాదాత్మ్యభావం పొందడం ప్రమోదం అని చెప్పారు. దీనికి ఒక చక్కటి ఉదాహరణ చెప్పారు. ఒకడు తనకు ఇష్టమైన మామిడి పండ్లు మార్కెట్‌లోనికి వచ్చాయని

విన్నాడు. వెళ్ళి చూడగానే అతనికి ఆనందం కలిగింది. అది 'ప్రియం'. వెంటనే డబ్బు యిచ్చి కొన్నాడు. చేతిలో పట్టుకొని ఆనందిస్తున్నాడు. అది 'మోదం'. ఇంటికి తీసుకొనివెళ్ళి మామిడిపండును కడిగి తిన్నాడు. అది 'ప్రమోదం'. కనుక ప్రతి వ్యక్తి "తనకు ఇష్టమైన వస్తువును చూడటంతోనే సంతృప్తి చెందడు. దానిని కొంటాడు, అనుభవిస్తాడు. దానిని అనుభవించినప్పుడే సంపూర్ణమైన ఆనందము కలుగు తుంది. దానినే "ప్రియం, మోదం, ప్రమోదం" అన్నారు భగవాన్ బాబా.

## పుష్టిజీవులు - మర్యాదజీవులు - ప్రవాహజీవులు

**"మానవులలో పుష్టిజీవులు, మర్యాదజీవులు, ప్రవాహజీవులు"** అని మూడు రకాలవారున్నారు. భగవంతునిచేత ప్రేమించబడినవారు **'పుష్టిజీవులు'** శాస్త్రపఠనము ద్వారా, సాధనలద్వారా, భగవద్విషయములను తెలుసుకొని, భగవదారాధన చేస్తూ, భగవంతుని ప్రేమిస్తూ, ఆనందమునందుకొనేవారు **'మర్యాదజీవులు'**. జగత్సం బంధమైన కర్మకలాపములలో మునిగి సంసార సాగరమును దాటుటకు దారి కానక సుడిగుండములో పడి, దైవచింతనారహితులై, 'పునరపి జననం, పునరపి మరణం' అనే ప్రవాహంలో కొట్టుకొని పోయేవారు **'ప్రవాహజీవులు'** అని భగవాన్ సాయి ఒక పర్యాయం పేర్కొనినారు. కనుక మనం 'పుష్టిజీవులం' కావాలి. నేను భక్తుడను - నేను భక్తుడును అనుకుంటే ప్రయోజనంలేదు. 'వీడు నా భక్తుడు' అని భగవంతుడు అనే స్థితికి మనం ఎదగాలి. అప్పుడే మన జీవితం సార్థకమవుతుంది.

## ప్రేమపుత్రులు - కామపుత్రులు

**"విద్యార్థులు, అధ్యాపకుల ప్రేమపుత్రులు. అసలు బిడ్డలు కామపుత్రులు. ప్రేమపుత్రులను, కామపుత్రులకంటే సన్నిహితం చేసుకోవాలి. అట్టివారినే 'ఆచార్యుడు' అని పిలుస్తారు. అధ్యాపకునకు, ఆచార్యునకు చాలా వ్యత్యాసమున్నది. ఆచరించి బోధించేవాడు 'ఆచార్యుడు'. ద్రోణాచార్యుడు తన కామపుత్రుడైన అశ్వత్థామకంటే ప్రేమ పుత్రుడైన అర్జునునకు మరింత రహస్యాలు బోధించాడు. కనుకనే ద్రోణుని 'ఆచార్యుడు' అని పిలుస్తూ వచ్చారు.కనుక అధ్యాపకులు 'ఆచార్యుడు' స్థాయికి ఎదగాలి"** అని చక్కటి హితబోధచేశారు భగవాన్ సాయి. అయితే ఈనాడు అధ్యాపకులు తమ కర్తవ్యాన్ని ఎంతవరకు నిర్వర్తిస్తున్నారు? క్లాసుకు వెళ్ళుతున్నారు. Lecture చెబుతున్నారు. అంతటితో తమ బాధ్యత అయిపోయిందని భావిస్తున్నారు, వెళ్ళిపోతున్నారు. అయితే పిల్లలు ఎంతవరకు అర్థం చేసుకున్నారు? అనే విషయం ఎవరైనా పట్టించు కుంటున్నారా? అంటే చాలామంది అధ్యాపకులు పట్టించుకోవటం లేదనే విషయం

స్పష్టమవుతున్నది. తన పిల్లలకు సరీగా చదువురాకపోతే అదే అధ్యాపకుడు ఎంత బాధపడుతాడు? కామపుత్రులమీద ఉన్న ప్రేమ, ప్రేమపుత్రులమీద ప్రదర్శించటంలేదు ఈనాటి అధ్యాపకులు అనేది అర్థమవుతున్నది. కనుక ప్రతి అధ్యాపకుడు ద్రోణుని ఆదర్శంగాగైకొని, కామపుత్రులకంటే ప్రేమపుత్రులను సన్నిహితం చేసికొని, వారిని అభివృద్ధిలోనికి తీసుకొనిరావాలి. కామపుత్రులను అలక్ష్యం చేయమనికాదు. ప్రేమపుత్రులను నిర్లక్ష్యం మాత్రం చేయవద్దని బాబావారి అభిప్రాయం.

## భక్తి - ప్రపత్తి

**"భక్తివంతునిపట్ల చూపే శ్రద్ధయే పరమప్రేమరూపంగా పరిణమిస్తే, అది భక్తి అవుతుంది. భగవంతునికి పూర్తిగా Surrender అయి విశ్వాసమును పెంచుకోవడమే ప్రపత్తిమార్గము"** అని భగవాన్ బాబా చెప్పారు. వేదకాలంలో శ్రద్ధయే భక్తిగా పరిగణించబడేది. చాలామంది కర్మవేరు, భక్తివేరు, జ్ఞానం వేరు అని భావిస్తుంటారు. ఇది పొరపాటు. ఈ మూడు సాధనామార్గాలు మూడు చక్రాల సైకిలువంటివి. కర్మ పుష్పము, భక్తి కాయ, జ్ఞానము ఫలము. ఈ మూడింటికి శ్రద్ధయే మూలాధారము. అందువలననే **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం"** అని బోధిస్తున్నది భగవద్గీత. భగవంతుని ప్రీతితో ఆరాధించుట ఒక విధమైన సాధన. భక్తిని పెంచుకోవాలంటే మొదట మనం విశ్వాసమును పెంచుకోవాలి. శ్రద్ధ దివ్యత్వ సాధనలో వినియోగ పడితే భక్తిగా పరిణమిస్తుంది. 'భక్తి' అంటే పూజామందిరాలలో కేవలం పూజలు చేయటంకాదు. దివ్యత్వం మీద పరమప్రేమను పెంచుకోవాలంటూ భగవాన్ సాయి భక్తి లక్ష్యాన్ని చక్కగా వివరించారు. "తమ ప్రేమ భగవంతునియందు ఎంతమాత్రం కలదని యోచించుట కంటే, భగవంతుని ప్రేమానుగ్రహములు తమపై ఎంత కలవనియు, ఎట్టి కర్మల నాచరించిన ఏరీతిగా మెలిగిన భగవంతుడు సంతుష్టుడు కాగలడో యోచించి, విచారించి, తదనుగుణ్యంగా వర్తించుటే భక్తి లక్ష్యము కావాలి" అన్నారు బాబా. భక్తికి 'శరణాగతి' ముఖ్యమంటూ బాబా ఒక ఉదాహరణ చెప్పారు. "కారుకు డ్రయివర్ ఉంటాడు. అదేవిధంగా సంసారమనే కారుకు కూడా 'సారథి' వుంటాడు. అతనే కృష్ణుడు, అతనే దైవము, అతనే 'సనాతన సారథి' అతను Old Man కాదు (ముసలివాడు కాదు) చాలా అనుభవజ్ఞుడు. అటువంటి అనుభవజ్ఞుణ్ణి, జ్ఞానవృద్ధుణ్ణిసారథి (Driver) గా ఎన్నుకొంటే ఎట్టి ఒడుదుడుకులు రాకుండా, క్షేమంగా మోక్షమనే ప్రయాణం (Journey) తో మనల్ని తీసుకొనిపోతాడు. అయితే అటువంటి అనుభవజ్ఞుడైన సారథి (Driver) కి పూర్తిగా (Surrender) అయినచో వెనుక సీటులో హాయిగా నిద్రపోయినా ఫరవాలేదు. సుఖంగా గమ్యం చేరగలుగుతారు. అదే విధంగా నీ కష్టాలు, దుఃఖములు,

విచారములు భగవంతునికి అర్పితం చేసి, అంతా భగవంతునిపై భారం వేసి, విశ్వాసంతో పయనించాలి. ఇట్టి విశ్వాసమును పెంచుకోవటమే 'ప్రపత్తి మార్గం' అంటారు బాబా. కనుక భక్తి ప్రపత్తులను పెంచుకోవాలి.

## భీతి - ప్రీతి - నీతి

**"భీతి, ప్రీతి, నీతి - ఇవే మానవునికి ప్రధానమైన విలువలు. వీటిని కోల్పోవడం చేతనే మానవతా విలువలను కూడా కోల్పోతున్నాం"** అని భగవాన్ బాబావారు తన ఆవేదనను వెలిబుచ్చుతూ పాపభీతిని, దైవ ప్రీతిని మనం పెంచుకోవాలి. సంఘంలో నీతిని అభివృద్ధి పరచాలి అన్నారు. నేటి రకరకాల విప్లవాలకు కారణం ఏమిటని విచారిస్తే. పాపభీతి లేకపోవటం, దైవప్రీతి కోల్పోవటం, సంఘనీతి లుప్తం కావటమేనని తేటతెల్లమవుతున్నది. 'పాపభీతి' అనేది లేకపోవటం వలన అనేక పాపాలకు ఒడిగడుతున్నారు, హింసా కృత్యములకు పాల్పడుతున్నారు. 'దైవప్రీతి' అనేది లేక పోవటం వలన ఏ మాత్రం భయపడకుండా అసత్యమాడగలుగుతున్నారు. ప్రేమలేకుండా కఠినంగా ప్రవర్తిస్తున్నారు. సంఘనీతి లేకపోవటం వలన అధర్మ ప్రవర్తనులవుతున్నారు, అరాచకాలు సృష్టించడానికి ఏమాత్రం వెరవడం లేదు. పాపభీతిలోనే అహింస, శాంతములు లభిస్తాయి. దైవప్రీతి సత్యము, ప్రేమలను అభివృద్ధి పరుస్తుంది. ఇకపోతే సంఘనీతి మన ధర్మం. **"మనలో నిజంగా దైవప్రీతి గనుక ఏర్పడుతే 'పాపభీతి' కలుగుతుంది. ఈ రెండూ వుంటే వెంటనే సంఘంలో నీతిని సాధించగలం. సంఘనీతి మానవజాతికి జ్యోతి"** అని అంటారు బాబా. కనుక కేవలం సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలు అని చిలుక పలుకులు పలికినంత మాత్రాన ప్రయోజనం లేదు. 'భీతి, ప్రీతి, నీతి' అనే ప్రధానమైన గుణములను ఆచరణలో పెట్టినప్పుడు మాత్రమే ఈ మానవతా విలువలను పోషించిన వారమవుతాం. అందువలననే ప్రతి ఒక్కరూ పాపభీతిని, దైవప్రీతిని పెంచుకోవాలి, సంఘంలో నీతిని అభివృద్ధి పరచాలంటారు బాబా.

## భీష్ములు - విభీషణులు

"భీష్ములు కాదు విభీషణులుకండి!" అని భగవాన్ బాబా చక్కగా చమత్కరించారు. ఇది చమత్కారం కాదు. బాబా నేర్పే సంస్కారం. రావణుడు చేస్తున్న అన్యాయ, అక్రమ, అనాచారములను చూచి విభీషణుడు సహించుకోలేక పోయాడు. తన సోదరునికి అనేక విధముల నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. కాని రావణుడు వినలేదు. అతని వద్ద వుండటానికి మనస్కరించక ధర్మమూర్తి

అయిన శ్రీరాముని పాదములు పట్టాడు. మహాభారత యుద్ధమునకు ముందు కృష్ణుడు కౌరవసభలో ధర్మమేమిటో చక్కగా వివరించాడు. కౌరవుల చెంత వుండటం అధర్మమని తెలిసినప్పటికీ, వారి ఉప్పపులుసు తింటున్నాముగదా యని భావించి భీష్మద్రోణాదులు బయటకు రాలేకపోయారు. దుష్టులు, దుర్మార్గుల చెంతవుండటం కంటే తీర్థయాత్రలకు పోవటం మంచిదని భావించి వెళ్ళిన విదురుడు క్షేమంగా ఉన్నాడు. దుర్మార్గులైన దుర్యోధనాదులను సమర్థించిన భీష్మ ద్రోణాదులకు మాత్రం దుర్యోధనాదులకు పట్టిన గతే పట్టింది. రావణుని వదలి బయటకు వచ్చిన విభీషణుడు మాత్రం శ్రీరాముని అనుగ్రహాన్ని పొందగలిగాడు. ఇక్కడ మనం నేర్చుకోవలసిన 'నీతి' ఒకటి ఉన్నది. మన స్నేహితులుగాని, మన సోదరులుగాని, మన పుత్రులుగాని, మన బంధువులుగాని దోషములకు పాల్పడినప్పుడు వారిని సరిదిద్దడానికి ప్రయత్నించాలి. విననప్పుడు వారి నుంచి దూరంగా పోవాలి. అలా చేయనివారందరూ దుష్టులు, దుర్మార్గులతో పాటే శిక్షను అనుభవించవలసి వస్తుంది. అందువలనే "భీష్ములు కాకండి! విభీషణులు కండి!" అని హెచ్చరించారు భగవాన్ బాబా. ఈ మాటల వెనుక ఎంతో అంతరార్థం వున్నది. జీవితంలో నేర్చుకోవలసింది యింకా ఎంతో ఉన్నది.

## బ్లడ్డు - ఫుడ్డు - దుడ్డు

**"మన బ్లడ్డు (Blood), మన ఫుడ్డు (Food), మన దుడ్డు (Money) అంతా మన తల్లిదండ్రుల వరప్రసాదమే. కనుక వీటిని ఏమాత్రం మనం వృథా (Waste) చేయకూడదు. అయితే ఈనాటి విద్యార్థులు అమితంగా డబ్బులు ఖర్చుచేస్తున్నారు. తల్లిదండ్రులు ఎంత కష్టపడి డబ్బులు పంపిస్తున్నారో మీరు గుర్తించాలి. వారు చెమటోడ్చి, ఎంతో కష్టపడి సంపాదించి, వారు కడుపునిండా తినకుండా, మిగిల్చి మీకు పంపిస్తుంటారు. వారు కష్టపడుతూ కూడా, మీకు సుఖాన్ని అందించాలని, మీకు డబ్బు పంపుతూ ఉంటారు. కనుక ప్రతి పైసా మన రక్తం బొట్టుతో సమానంగా చూచుకోవాలి. అవసరమైన దానికే ఖర్చుపెట్టాలి. వ్యర్థం మాత్రం చేయకూడదు. ఈనాడు విద్యార్థులు, కాలేజీ ఎన్నికలలో, అసెంబ్లీ ఎన్నికల కన్నా ఎక్కువ ఖర్చుపెడుతున్నారు. ఎన్నికలలో గెలిచిన తరువాత 'పిక్‌నిక్'ల పేరుతో చాలా డబ్బు ఖర్చు చేస్తుంటారు. ఇది ఏమాత్రం మంచిదికాదు. మీ భవిష్యత్తును గురించి యోచించాలి, తల్లిదండ్రుల పరిస్థితిని కూడా చింతించాలి. పంపుతున్నారుగదా యని ఇష్టమొచ్చినట్లు ఖర్చుచేయకూడదు"** అని విద్యార్థులకు భగవాన్ సాయి హితవు చెప్పారు. కనుక ఈనాటి విద్యార్థులు ఈ సాయి సందేశమును పాటించాలి, ఆచరణలో పెట్టాలి.

## మితభాష - హితభాష

"అధ్యాపకులు, విద్యార్థులు మితభాషను, హితభాషను అభ్యసించడం అత్యవసరం. అతి భాష మతిహాని, మితభాష అతిహాయి" అన్నారు భగవాన్ బాబా. మనం మాట్లాడే మాటలు, కఠినంగా , కటువుగా ఉండరాదు. హేళనగా అంతకన్నా వుండరాదు. మృదుమధురంగా మాట్లాడటం నేర్చుకోవాలి. అతిగా మాట్లాడేవారిని 'చాటర్‌బాక్స్' అంటారు. ఎక్కువ మాట్లాడటం ఆయుఃక్షీణం అంటారు పెద్దలు. 'అతిసర్వత్రావర్జయేత్" గదా! ఏవిషయంలోనూ అతి పనికిరాదు. అతి, అరిష్టానికి దారి తీస్తుంది. దడదడా మాట్లాడేవారిని ఎవరూ లెక్క చేయరు. మితంగా, హితంగా మాట్లాడే వారిని గౌరవిస్తారు. కనుక మనం పరుషంగా, కోపం వచ్చే విధంగా మాట్లాడకూడదు. "గొడ్డలి చేత కొట్టబడిన వృక్షమైనా చిగురిస్తుంది గాని, మాటలతో దెబ్బతిన్న మనస్సు మాత్రం తిరిగి చిగురించదు" అంటాడు విదురుడు. కనుక మనం మితంగా, హితంగా, సౌమ్యంగా, సరళంగా మాట్లాడటం నేర్చుకోవాలి.

## యంత్రము - మంత్రము - తంత్రము

"దేహమే ఒక 'మంత్రము'. మన శ్వాసనే ఒక 'మంత్రము'. హృదయమే ఒక 'తంత్రము'. ఈ శ్వాస అనే మంత్రం ఏమిటి? అదే 'సో2హం'. ఈ శ్వాసనే 'సో2హం' అనే మంత్రాన్ని దినమునకు 21,600 సార్లు జపిస్తూ వస్తుంటుంది. మన ఉచ్ఛ్వాస నిశ్వాసములలోనే మంత్ర రూపం చేరి ఉంది. హృదయమనేటటువంటి తంత్రం దీనిని సరియైనటువంటి మార్గంలో ప్రకృతికి ప్రబోధిస్తుంది. దీనిని అందించడానికి దేహమనే యంత్రం అత్యవసరం" అని అంటారు భగవాన్ బాబా. ఈ యంత్రంలో ఏ చిన్న భాగం సరిగా లేకపోయినా ఆ యంత్రం పనిచేయదు. ఉ॥ ఈనాడు రాకెట్స్ చంద్రమండలానికి పంపుతున్నారు. దానిలో ఏ చిన్న పిన్ను ఊడిపోయినా ఆ రాకెట్ క్రిందపడి భస్మమైపోతుంది. అదే విధంగా ఈ శరీరంలో ఏ అంగం పని చేయకపోయినా ఆశించిన పనులు కార్యరూపం దాల్చవు. దేహమునకు శ్వాస ముఖ్యం. ఆ శ్వాస సరిగా లేకపోతే దేహమనే యంత్రం పనిచేయదు. భగవంతుని ఉనికి గమనించడానికి ఆధ్యాత్మిక మార్గం ఎంతైనా తోడ్పడుతుంది. దేహమునకు శ్వాస ఎంత ప్రధానమో, ఆధ్యాత్మికమునకు విశ్వాసం అంత ప్రధానం. భగవంతుని చేరుకోవటానికి నామస్మరణయే రాజమార్గం. జపతపాదులన్నింటికీ నామమే మూలాధారం. ఋగ్వేదమంతా నామం, యజుర్వేదమంతా మంత్రం, సామవేదమంతా గానం, అథర్వణ వేదమంతా తంత్రములతో కూడినటువంటివి. కనుక నామ, గాన, మంత్ర, తంత్రముల యొక్క సమ్మిళితమే మానవుని యొక్క

హృదయమని భగవాన్ బాబా చెప్పారు. కనుక ప్రశాంతమైన వాతావరణంలో, నిర్మలమైనటువంటి హృదయంతో, నిశ్చలమైన చిత్తంతో, పవిత్రమైన భావంతో 'నామస్మరణ' చేయాలి. **భగవన్నామమే భవసాగరమును దాటించునావ!**

## రాహుకేతువులు

**"మానవుని భావాలు రాగద్వేషములతో కూడుకొని వుంటాయి. రాగద్వేషములే మానవుని పాలిటి రాహుకేతువులు. నవగ్రహములు... నవగ్రహములు... అని భావిస్తున్నామే గాని, ఇది కేవలం భ్రాంతి మాత్రమే. రెండు గ్రహములే మనల్ని పట్టి పీడిస్తున్నాయి. అవే మానవుని పాలిటి రాహుకేతువులైన రాగద్వేషములు"**అని అంటారు భగవాన్ బాబా. దీనిని అర్థం చేసుకొనలేక ఏదో గ్రహం పట్టి పీడిస్తున్నదని భావిస్తుంటారు. ప్రేమ ఉన్నచోట ఈర్ష్యాద్వేషములనే రాహుకేతువులు ఉండరు. ప్రేమచేత అరిషడ్వర్గము లను సహితం జయించవచ్చును, లోని శత్రువులకు లొంగిపోయినవాడు, బయటి శత్రువులపై ఏరీతిగా విజయమును సాధించగలడు? లోని శత్రువులను జయించాలంటే, ఒక్క ప్రేమాస్త్రము ద్వారానే సాధ్యమవు తుందంటారు బాబా. కనుక ప్రతి ఒక్కరూ ప్రేమను పెంచుకోవాలి, ప్రేమలో జీవించాలి, ప్రేమమయమైన జీవితాన్ని గడపాలి. అప్పుడు ఏ రాహుకేతువులు మనల్ని వెంటాడవు, మనల్ని బాధించవు.

## లోకదాత - శ్లోకదాత

దారులు కొట్టే దొంగ రత్నాకరుడు మహర్షుల బోధలచేత 'రాం..రాం..' అని చింతిస్తూ వచ్చాడు. రామనామంచేత అతనిలో రామనామం లీనమైపోయింది. కట్టకడపటికి రత్నాకరుడిపైన రామ తేజస్సు ఉట్టిపడింది. దారులు కొట్టే దొంగ సర్వులకూ ఆది కవిగా మారిపోయినాడు. అతనే వాల్మీకి అయినాడు. **"లోకదాత రాముడైతే, శ్లోకదాత వాల్మీకి అయినాడు. లోకదాతకు, శ్లోకదాతకు ఎట్టి బేధమూ లేకుండా పోయింది. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి'. దేనిని స్మరించాడో ఆ రూపాన్ని పొందాడు"** అని భగవాన్ బాబా చెప్పారు. కనుక మనం మంచిని చింతించాలి. మంచిని మాట్లాడాలి. మంచిమాటలు వినాలి. మంచిపనులు చేయాలి. అప్పుడు మనం కూడా మంచివారమైపోతాం.

## విందులు - మందులు

**"పెద్దల వాక్యాలు విందులు కావు మందులు. విందులలో ఏపదార్థమైనా వదిలి వేయవచ్చునుగాని, భవరోగాన్ని నివారించే ఈ మందు అడుగుపట్టినా, అందులో నీరు**

**పోసైనా ఉపయోగించాలి కానీ వదిలిపెట్టరాదు"** అని అంటారు భగవాన్ బాబావారు. కొంతమంది మూఢులు పెద్దల మాటలను లెక్కచేయరు. గురువాజ్ఞలను శిరసావహించరు. దైవవాక్యములను హేళన చేస్తుంటారు. సాక్షాత్ శ్రీకృష్ణ పరమాత్మ అవతరించిన యాదవకులం 'గర్గుడు' (మహర్షి మరియు కులగురువు) అనే మహనీయుని అవ హేళన చేయటం వలన సర్వనాశనం అయిపోయింది. నిండు సభలో పవిత్రురాలైన ద్రౌపదిని అవమాన పరచడం వలన కౌరవ వంశం మొత్తం నామ రూపాలు లేకుండా పోయింది. పెద్దల మాటలు వినని వారెందరో పాడైపోయినారు. పెద్దలు చెప్పే మాటలు ఎప్పుడో ఒకప్పుడు అవసరమవుతూనే వుంటాయి. బాబా చెప్పినట్లు పెద్దల వాక్యాలు మందులలాంటివి. ఏ మందూ వ్యర్థం కాదు. ఏదో ఒక రోగానికి అవసరమవుతుంది.

## విత్తచోరుడు - చిత్తచోరుడు

"నీ చిత్తమును భగవంతునికి అర్పించు. అప్పుడు నీకు తృప్తి, భగవంతుని **అనుగ్రహం కూడా కలుగుతుంది. భగవంతుడు ఎప్పుడూ చిత్తచోరుడే, విత్తచోరుడు కాదు. విత్తచోరులు మీరే. విత్తచోరుల నుండి చిత్తచోరులుగా మారండి"** అని భగవాన్ చక్కగా చమత్కరించారు. మనస్సు బహుచంచలమైనది. సహజంగా ప్రతివాని మనసు కాంత మీదకో, కాంచనం మీదకో పరుగెడుతుంది. ధన కనక వస్తువాహనాలపై వాలుతుంది. ఇవన్నీ తాత్కాలికమైన ఆనందమును మాత్రమే యిస్తాయి. శాశ్వతమైన ఆనందమును యివ్వవు. భగవదానుగ్రహం ఒక్కటే శాశ్వతమైన ఆనందాన్ని యిస్తుంది. చిత్తమును భగవంతునికి అర్పించినప్పుడే భగవదాను గ్రహం లభిస్తుంది. కనుక ప్రతి ఒక్కరూ జగద్రక్ష అయిన భగవంతునికి Surrender కావాలి. అనగా శరణాగతి తత్త్వాన్ని పెంపొందించుకోవాలి. కనుక ప్రతి ఒక్కరూ స్వార్థమును విడనాడి సర్వమునూ భగవంతునికి అర్పించాలి. అసలు భగవంతునికి కావల్సింది నీ చిత్తముగాని, నీ విత్తము కాదు. భగవంతుడు భౌతికమైన సిరిసంపదలు కోరడు, నిశ్చలమైన, నిర్మలమైన నీ చిత్తమును మాత్రమే ఆశిస్తాడు. అది తెలుసుకోలేక చాలామంది అవివేకంలో పడి ధనమును సమర్పించు కుంటున్నారు. చిత్తమును అర్పితంగావించడం కష్టం కాబట్టి, తనకున్న ధనంలో కొంత యిచ్చి భగవంతుని మెప్పును పొందడానికి ప్రయత్నిస్తున్నారు. భగవంతుడు చిత్తమునకు లొంగుతాడు గాని విత్తమునకు లొంగడు. ఈ వాస్తవాన్ని ప్రతి ఒక్కరూ తెలుసుకోవాలి.

## విజ్ఞానం - అజ్ఞానం - ప్రజ్ఞానం

"ఈనాడు విజ్ఞానం పెరిగిపోయిందని మనం విఱ్ఱవీగుతున్నాం, విజ్ఞానంతో పాటు అజ్ఞానం అంతకంటే పెరిగిపోతున్నది. విజ్ఞానానికి ఆధ్యాత్మిక పరిజ్ఞానాన్ని జోడించాలి. ఈ రెండూ చేరినప్పుడే ఆనందం లభిస్తుంది. సైన్సువేరు, ఆధ్యాత్మికత వేరు అని విభజించరాదు. ఈ రెండింటిని సమన్వయ పరచాలి" అని అంటారు భగవాన్ బాబా. విజ్ఞానం ఎంతగా పెరిగినా దురాలోచనలు, దురలవాట్లు, దుర్బుద్ధులు దూరం కావటం లేదు. వివేకం కలగటం లేదు. వివేకం లేని విజ్ఞానం వినాశనానికి దారి తీస్తుంది. కారణం ఏమిటి? సైన్సుకు విచక్షణా జ్ఞానాన్ని, జీవిత విలువలను పెంచే స్తోమత లేదు. జీవిత సమగ్రతను పోషించే శక్తి ఒక్క ఆధ్యాత్మికతకు మాత్రమే ఉన్నది. మానవతా విలువలు ఆధ్యాత్మికతతో జోడించినప్పడే అభివృద్ధి కాగలవు. సైన్సుతో ముడిపెడితే అవి ఏమాత్రం అభివృద్ధి కావు." అని అంటారు స్వామి. విత్తనాన్ని భూమిలో పెట్టినప్పడే మొక్క మొలుస్తుంది. డబ్బాలో పెట్టి నీళ్ళు పోస్తే కుళ్ళిపోతుంది. కనుక మొట్ట మొదట ఆధ్యాత్మిక భావాలను అభివృద్ధి గావించుకోవాలి. సైన్స్ ఒక్కటే అన్నిటికీ పరిష్కారం కాదు. Science కు Spirituality కూడా తోడైనప్పడే సమగ్ర పరిజ్ఞానమును సాధించగలుగుతాం.

## వ్యష్టి - సమిష్టి - సృష్టి - పరమేష్టి

"వ్యష్టి జీవుడు. సమిష్టి దేవుడు. కనుక సమాజమే దేవుడు. ఆ దృక్పథమును మనం అభివృద్ధి పరచుకోవాలి. వ్యష్టినుండి సమిష్టిలో ప్రవేశించాలి. ఈ సమిష్టి నుండి సృష్టిలో ప్రవేశించాలి. సృష్టిలో ప్రవేశించి పరమేష్టిలో ఏకం కావాలి. వ్యష్టి,సమిష్టి, సృష్టి, పరమేష్టి - ఈ నాలుగింటి ఏకత్వాన్ని మనం పొందాలి" అని అంటారు భగవాన్‌సాయి. ఈ స్థితికి ఎదగాలంటే మొట్టమొదట సమాజక్షేమాన్ని మనం కోరాలి. ఈ సమాజం యొక్క క్షేమాన్ని కోరాలనుకుంటే, నీలో ఆధ్యాత్మిక పరివర్తన రావాలి. అదియే 'S' అనగా Spiritual Change (ఆధ్యాత్మిక పరివర్తన) రెండవది 'A' అనగా Association Change (సాంఘిక పరివర్తన) మూడవది 'I' అనగా Individual Change (వ్యక్తిపరివర్తన) అదియే Sai తత్త్వమని భగవాన్ ఒక పర్యాయం చమత్కరించారు. ఇట్టి పరివర్తన జరిగినప్పడే ప్రపంచమంతా సుక్షేమంగా ఉంటుంది.

## శివం - శవం

"ఈ దేహం జీవుని మందిరం. మందిరాన్ని శుభ్రపరచటంలో లక్ష్యమేమిటి? ఈ మందిరంలో ప్రతిష్ఠితుడైన దేవుని పవిత్ర భావంతో చూడాలి. లక్ష్యమునందు దైవత్వాన్ని

ఉంచుకొనక, దేహానికి మాత్రమే అనేకరకముల పెయింట్లు చేస్తుంటే ఏమి ప్రయోజనము? శవానికి అలంకరించినట్లుంటుంది. లోపల 'శివం' వున్నది. శివాన్ని లక్ష్యంలో పెట్టుకోవాలి. అంతవరకే ఇది జీవితం. శవాన్ని లక్ష్యంలో పెట్టుకుంటే అది జీవితం కాదు. మన లక్ష్యం శవం కాదు, శివం" అని అంటారు భగవాన్ బాబా. బాబావారు ఒక పర్యాయం "నేను మనిషిని కాదు, దేవుణ్ణికాదు. నాకు వర్ణాశ్రమములు లేవు. నన్ను సద్గురువుగా సత్యం, శివం, సుందరంగా తెలుసుకొనుడు" అన్నారు. ఈ మూడూ ప్రేమ యొక్క రూపాంతరాలే. ప్రేమ యొక్క భావనయే 'సత్యం'. ప్రేమయొక్క ఆచరణయే 'శివం'. ప్రేమయొక్క స్వరూపమే 'సుందరం' కనుక బాబా 'ప్రేమమూర్తి', కరుణామూర్తి'.

## సంస్కారం - సంసారం

"ఏనాటికైనా మన వెంట వచ్చేది, జంటవుండేది మన సంస్కృతి, సంస్కారమేగాని సంసారంకాదు. అయితే ఈనాటి విద్యార్థుల యొక్క చిత్తములందు సంస్కారం మరుగున పడి, సంసారం అభివృద్ధి అవుతున్నది" అని తన ఆవేదనను వెలిబుచ్చారు భగవాన్ బాబా. అసలు 'సంస్కృతి' అంటే ఏమిటి? సంస్కరించబడినటువంటిది. సంస్కారమే లేకపోతే సంస్కృతియే లేదు. కనుక మొట్టమొదట సంస్కారం కావాలి. సంస్కారంలేని చదువు, వినయంలేని విద్య ఏమాత్రం రాణించవు. నీతినిజాయితీలు పెంచుకోవటానికి ప్రయత్నించాలి. మానవతా విలువలను పెంపొందించుకోవాలి. అప్పడే మానవుడు పరిపూర్ణ మానవుడుగా వికసించగలడు. పరిపూర్ణ మానవుడిగా మార్చే చైతన్యం విద్యలో ఆవిర్భవించాలి. మన జీవితాలను మనం ఆదర్శంగా రూపొందించుకోవాలి. మన నడతను మనం చక్కగా తీర్చిదిద్దుకున్నప్పడే, మన అదృష్టం దానిపైన ఆధారపడి వుంటుంది. కనుక మనం సంస్కారవంతులం కావాలంటారు బాబా.

## సలక్షణం - విలక్షణం - అవలక్షణం

"నేడు మానవులలో సలక్షణ, విలక్షణములు అనే గుణముల కంటే 'అవలక్షణము' అనే గుణము అధికంగా కనిపిస్తున్నది" అని అంటారు భగవాన్ బాబా. మన నడవడి, మన ప్రవర్తన, మన చరిత్ర సలక్షణంగా వుండాలి. ఎవరి చేత వేలెత్తి చూపకుండా, దోషరహితంగా తెల్లని కాగితం వలె స్వచ్ఛంగా, సలక్షణంగా ఉండాలంటారు బాబా. సృష్టినంతానూ విలక్షణంగా చూడాలి. ఇదంతా భగవంతుని స్వరూపమని గుర్తించాలి. ' విశ్వం విష్ణు స్వరూపం' గదా! ఈ జగత్తునంతా విష్ణు స్వరూపంగా

భావించి విలక్షణంగా చూడటం నేర్చుకోవాలంటారు బాబా. అయితే ఈనాడు దైవ- భ్రాంతిలోపించి దేహభ్రాంతి పెరగటం వలన మానవుడు అనేక బాధలను, కష్టములను ఎదుర్కొనవలసి వస్తున్నదని చెబుతూ, ఈ లక్షణమునే 'అవలక్షణము' అని బాబా స్పష్టం చేశారు. కనుక మన చరిత్ర సలక్షణంగా ఉండాలి. విశ్వమును విష్ణుస్వరూపంగా భావించి విలక్షణంగా చూడాలి. అవలక్షణములను దరికి చేరనీయరాదు.

## 'సిరి'దాసులు - 'హరి'దాసులు

**"సిరికి దాసులు కాకండి! హరికి దాసులుకాండి!"** అని చమత్కరించారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. అయితే ఈనాడు ఇది తారుమారైంది. ఈనాడు చాలామంది ధనానికి **'దాసో2హం'** అంటున్నారు. ధర్మానికి తిలోదకాలిస్తున్నారు. ఏమిటయ్యా! అంటే **'ధనమూలమిదంజగత్'** అంటున్నారు. ధనం అవసరమే. వద్దని కాదు. తినటానికి, ఉండటానికి, జీవించడానికి ధనం కావాల్సిందే. దీనిని ఎవరూ కాదనరు. అయితే దానికి మితం (Limit) ఉండాలి. తృప్తి ఉండాలి. పరిమితి దాటితే ప్రమాదం సంభవిస్తుంది. అతి మతిని చెడగొడుతుంది. మితం హితం చేకూరుస్తుంది. దీనిని విస్మరిస్తే మనిషి గతి అధోగతే. **'అతి సర్వత్ర వర్జయేత్'** అనే సత్యాన్ని విస్మరించరాదు.



## A.B.C. OF LIFE

"విజ్ఞానం అవసరమే. ఐతే విజ్ఞానంలో ఉన్న ప్రజ్ఞానాన్ని మనం విచారణ చెయ్యాలి. విజ్ఞాన ప్రజ్ఞానముల సమ్మిళిత స్వరూపమే మానవత్వం. కనుక నిరంతరం జాగరూకులమై మెలగాలి. దీనినే A.B.C. of Life అన్నారు.

**'A'** For Always **'B'** For Be **'C'** For Careful

Always Be Careful 'ఎల్లవేళలా జాగరూకతతో మెలుగు' అని అర్థము. కాని ఈనాడు నిజమైన ప్రజ్ఞానతత్త్వాన్ని నిర్లక్ష్యపరుస్తూ, అజాగ్రత్తగా జీవిస్తున్నాం అని అంటారు భగవాన్‌బాబా. కనుక నిర్లక్ష్యం నిరాశను తెచ్చిపెడుతుంది. అలక్ష్యం అహంకారానికి దారి తీస్తుంది. జాగ్రత్త వుంటే దేనినైనా సాధించగలం.

## ACTION - CONNECTION

హృదయం 'దయ, కరుణలు' అనే నీరుతో నిండి ఉంటుంది. మన హృదయం దయామయమైనటువంటిది. "దయగల హృదయమే దైవమందిరం" అని అన్నారు గదా! ఆ హృదయంలో ఉన్నది Action లోనికి రావాలంటే 'సమ్యక్ దృష్టి' (Good Look) అనేటటువంటి Tap కు, హృదయమనేటటువంటి Tank కు Connection పెట్టాలి. ఆ సమ్యక్‌దృష్టి (Good Look) నే ప్రేమ (Love) అన్నారు. ఆ Love లేనప్పుడు హృదయంలో దయ, కరుణలు అనే నీరు వుండి ప్రయోజనం ఏమిటి? కనుక మొట్టమొదట ఈ Tank కు Taps కు Love అనే Connection యివ్వాలి. ఈ ప్రేమ ఉండినప్పుడే సర్వమూ మనకు నెరవేరుతుంది అని అంటారు ప్రేమమూర్తి భగవాన్‌బాబా. కనుక ప్రతిఒక్కరూ ప్రేమను పెంచుకోవాలి, పెంచుకొనిన ప్రేమను పదిమందికి పంచాలి. ప్రేమతో జీవించాలి, ప్రేమలో జీవించాలి, అందువలననే "Love is God, Live in Love (ప్రేమయే దైవం, ప్రేమలో జీవించు) అంతే కాదు Make Others Live in Love (ఇతరులను కూడా ప్రేమలో జీవించునట్లు చేయి!) - ఇదే ఈనాడు మనం చేయవలసిన పని" అని అంటారు భగవాన్‌బాబా.

## ALLERGY - ENERGY

ఈనాడు Bookish Knowledge (పుస్తక జ్ఞానం) మాత్రం పెరిగిపోతున్నది. అనుభవ జ్ఞానం (Practical Knowledge) అసలే ఉండటం లేదు. విచక్షణా జ్ఞానం (Discrimination Knowledge) ఏమాత్రం లేకుండా పోతున్నది. ఈనాటి Bookish Knowledge, రేపు Knowledge, తరువాత Allergy గా వికటిస్తున్నది. అదికాదు. Knowledge దివ్యమైన Energy (శక్తి)గా మారాలిగాని Allergy గా మాత్రం

కాదంటారు బాబా. ఇవి ఎంతో అనుభవంతో చెప్పిన మాటలు. అనుభవంలేని విద్య అక్కరకు రాదు. శక్తిని సముపార్జించి పెట్టని విద్యవలన ప్రయోజనం లేదు. భౌతిక, శారీరక, ఆర్థిక బలములతోపాటు, నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక శక్తులు కూడా కలిసినప్పుడు అది దివ్యశక్తిగా మారుతుంది. అటువంటి దివ్యశక్తిని విద్యార్థులు సముపార్జించాలి.

## ATTACHMENT - DETACHMENT

ఎంత చదివినప్పటికినీ, ఎంతకాలమైనప్పటికినీ ఏమి ప్రయోజనం? కట్టకడపటి వరకును తన సత్యాన్ని తాను గుర్తించుకోలేకపోతున్నాడు? కారణమేమిటి? Attachment.. Attachment.. Attachment కాదు Detachment కావాలి. Lock (తాళం) లో key (తాళం చెవి) పెట్టి కుడివైపుకు త్రిప్పతే తాళం తెరుచుకుంటుంది. ఎడమవైపుకు త్రిప్పతే తాళం పడుతుంది. ఒకటే తాళం, ఒకటే తాళం చెవి. కాని త్రిప్పటంలో ఉన్నది తేడా. నీ హృదయమే ఒక Lock, నీ మనసే ఒక Key , Turn God side ( దైవమువైపునకు త్రిప్పు) అదే Detachment (బంధమును త్రుంచుకొనుట) Turn World side ( లోకమువైపునకు త్రిప్పు). అదే Attachment (బంధమును పెంచుకొనుట). అదే Bondage (దాస్యం).

## ART - HEART

"గ్రామసేవ మన లక్ష్యం. ఇది మనం ఎవరినీ ఆకర్షించుటకు చేసే Art (కళ) కాదు. మన సేవ Heart (హృదయం) నుంచి వచ్చేది. Art is External, Heart is Internal అప్పడే Self Satisfaction (ఆత్మ సంతృప్తి) ఉంటుంది. చెప్పేది చెయ్యాలి, చేసింది చెప్పాలి, చెయ్యందే చెప్పరాదు" అంటారు బాబా. బాబా మాట్లాడే ప్రతిమాట వెనుక మానవత్వం ఉట్టిపడుతూ ఉంటుంది. హృదయం విప్పి మాట్లాడుతారు, హృదయంతో మాట్లాడుతారు. వారి మాటలవెనుక Love (ప్రేమ) తొణికిసలాడుతూ ఉంటుంది. అది వారి Heart (హృదయం) నుండి వస్తుంది, Lips (పెదిమలు) పైనుండి కాదు.

భజనలు చేసినా, కీర్తనలు పాడినా, సంకీర్తనలు చేసినా, నామస్మరణ చేసినా హృదయమునుండి రావాలి. పెదవులపై నుండి వస్తే ప్రయోజనం లేదు. పెదవులపై నుండి వచ్చే నామస్మరణకంటె, చేతులతో చేసే సేవ చాల మేలంటూ "Heart నుంచి వచ్చినటువంటివైతే Art ను మరచిపోతాడు. అయితే ఈనాడు కలియుగ ప్రభావం వలన Art ను చూస్తున్నాడు, Heart ను మరచిపోతున్నాడు. అదికాదు. మనం Art ను మరచాలి, Heart ను పెంచాలి. భగవంతుని మన

Heart లో పెట్టుకోవాలి. భగవంతుని స్మరణ హృదయమునుండి రావాలి, ఉప్పొంగాలి.. ఉప్పొంగాలి.. తాదాత్మ్యభావన పొందాలి" అంటారు బాబా. కనుక మనం చేసే భజనలు, పాడే కీర్తనలు, స్మరించే నామస్మరణ హృదయంలోనుంచి ఉప్పొంగుతున్నదో, పెదవుల పైనుంచి వస్తున్నదో ఎవరికి వారు ఆత్మ విమర్శన గావించుకోవాలి.

"Art బహిర్ముఖమైనది, Heart అంతర్ముఖమైనది. Art మానవసృష్టి, Heart భగవత్‌సృష్టి. నరసృష్టికి, నారాయణ సృష్టికి సన్నిహిత సంబంధ బాంధవ్యమున్నది. ఒకటి బింబమైతే, రెండవది ప్రతిబింబం. ఈ రెంటిమధ్య 'ప్రకృతి' అనే అద్దం ఉన్నది. ఈ ప్రకృతి భావమును మనం ఏనాడు దూరం గావించుకుంటామో, ఆనాడే బింబ ప్రతిబింబములు ఏకమైపోతాయి." అంటారు బాబా. కనుక ప్రతి ఒక్కరు Art కు ప్రాధాన్యత నివ్వకుండా Heart కు ప్రాముఖ్యత ఇవ్వటం నేర్చుకోవాలి. అట్టి జీవితమే సార్థకమవుతుంది.

## *BEGGAR - BIGGER*

"ఎవరో బజారున పోయే Beggar (బిచ్చగాడు) చెప్పే విషయాలను విని ప్రచారం చేయకూడదు. ఆ Beggar చేసేటటువంటి ప్రచారం Beggarly (నీచమైన)గానే ఉంటుంది. Beggar ఎన్నటికీ Bigger కాలేడు" అని అంటారు బాబా. Bigger (గొప్పవాడు లేక పెద్దవాడు) అయినటువంటివాడు సత్యమును విచారించాలి. సత్యనిత్య పరిశీలన చేయాలి. మనం ఒక విషయాన్ని ప్రచారం చేయాలనుకుంటే ఇది నిజమా? కాదా అనే విషయమును తెలుసుకోవటానికి కొంత సమయము (కాలము) తీసుకోవాలని చెప్పారు బాబా. అయితే మనం దీనిని ఎంతవరకు పాటిస్తున్నాం? ఎవరికివారు ఆత్మపరిశీలన చేసుకోవాలి. కేవలం బాబా ప్రసంగాలు విని ఇంటికి వెళ్ళితే ప్రయోజనం లేదు. ఆచరణలో పెట్టని విషయాలు ఎన్ని విన్నా నిష్ప్రయోజనమే అవుతాయి. ఎంతకాలంనుంచి పుట్టపర్తి వెళ్ళుతున్నామనేది ప్రధానం కాదు, ఎంత నేర్చుకున్నామనేది ప్రధానం.

"ఏదో ఒక సర్టిఫికెట్ తీసుకుని ఆఫీసుల చుట్టూ తిరుగుతూ 'ఉద్యోగం... ఉద్యోగం'.., అని Beg ( అడుక్కొనుట) చేయకండి! మీరు Beggars (అడుక్కునే బిచ్చగాళ్ళు) కాకూడదు. Biggers (గొప్పవారు) కావాలి. గొప్ప ఆదర్శమును చూపించినప్పుడే మీరు Biggers అవుతారు. దేశానికి సేవచేస్తూ మీ జన్మను సార్థకం చేసుకోండి!" అని బాబా ఒక పర్యాయం విద్యార్థులకు హితబోధ చేశారు. విద్య కేవలం ఉద్యోగం చేయటానికే కాదని, విజ్ఞానాన్ని సముపార్జించి, దేశపురోభివృద్ధికి వినియోగించాలని బాబావారి ఆశయం. వారి ఆశయమును ఆచరణలో పెడితే మన దేశం సస్యశ్యామలమవుతుంది.

## CONFUSION - DEPRESSION

వేదాంతం చాలా సులభమైనటువంటిది. తెలియకపోవటంచేతనే చాలా Confusion ఏర్పడుతున్నది. ఈ Confusion (గందరగోళం) ఏర్పడినా ఫర్వాలేదుగాని Depression (కృంగదీస్తున్నది) వస్తున్నది. ఈ Confusion, Depression రెండు చేరి Fuse (ఫ్యూజ్) పోతున్నది. తెలుసుకుంటే చాలా సులభమైనటువంటిది వేదాంతం. వెన్ననైనా నలపడం కొంచెం కష్టమవుతుందేమోగాని, దానికంటే సులభమైనటువంటిది వేదాంతం. వెన్న చాలా మెత్తగానే ఉంటుంది. కాని అది కరగాలంటే వేడి చూపించాలి. భగవంతుడు కూడా చాలా మెత్తనివాడే. God is so Soft and sweet. మీరు అనుభవించాలనుకుంటే 'జ్ఞానాగ్ని'ని కొంచెం చూపించాలంటారు బాబా.

## COLLECTION - CONNECTION

ఆచరణలో పెట్టటానికి ప్రయత్నించండి. ఆచరణలో లేనప్పుడు, ఎన్ని వినినప్పటికీని, ఇది కేవలం ఒక టేప్ రికార్డరు మాదిరిగా ఉంటుంది. ఒట్టి టేపులో మనకు ఏమీ కన్పించవు, వినిపించవు. కాని ఆ టేపును, టేపు రికార్డులో పెట్టి కరెంటుతో Connect (కలుపుతే) చేస్తే, అప్పుడు రికార్డు చేసినదంతా మనకు వినిపిస్తుంది. అదే విధముగా హృదయములో చేరినటువంటి భావాలన్నీ కూడనూ ప్రేమతో భగవంతునితో Connection (కలపాలి) చేయాలి. అప్పడే హృదయము నుంచి ఆవిర్భవించినదంతా బయటకు వస్తుందని చెబుతూ "నీవు Collection (సేకరణ) చేసుకున్న Matter (విషయం) అంతా భగవంతునితో Connection (కలపాలి) చేయాలి. అప్పడే నీవు దానిని Select (ఎంపిక) చేసుకున్నవాడవవుతావు. ఆ Selection యే నీ ఇష్టం. అదియే ఇచ్ఛాశక్తి. ఆ ఇచ్ఛాశక్తియే క్రియాశక్తిగా మారుతుంది. ఆ క్రియాశక్తియే జ్ఞానశక్తిగా రూపొందుతుంది. ఈ మూడింటియొక్క స్వరూపములే కర్మ ఉపాసన జ్ఞానములు"అని అంటారు బాబా. కనుక ప్రతి కర్మ చిత్తశుద్ధితో చేయాలి. ఏ పనిచేసినా భగవత్ కర్మగా విశ్వసించి చేయాలి. "సర్వకర్మ భగవత్ ప్రీత్యర్థమ్" అని చేయాలి. అది తప్పక భగవంతునికి చేరుతుంది. భగవదానుగ్రహం ప్రాప్తిస్తుంది.

## CO-OPERATION - OPERATION

ఈనాడు చాలా విద్యాలయాలలో Unity (ఐకమత్యం) కోసం Unions (సంఘములు) ప్రారంభిస్తున్నామంటారు. Union అంటే అందరూ కలిసి మెలిసి ఉండటం. కాని యూనియన్ల పేరుతో పోటీలుపడి చిన్నాభిన్నమైపోతూ

Co-operation (సహకారం)ను సాధించవలసిన విద్యార్థులు Operations చేస్తున్నారని బాబా ఒక పర్యాయం చమత్కరించారు. డాక్టర్లు చేసేదానిని కూడా Operation (శస్త్ర చికిత్స) అంటారు. ఇక్కడ విద్యార్థులు ఆపరేషన్స్ చేస్తున్నారంటే కత్తులతో పొడుచుకుంటున్నారనటం సరిపోతుంది. బాబా నోటినుండి వెలువడే ప్రతిమాట వెనుక ఎంతో నిగూఢమైన అర్థం ఇమిడి ఉంటుంది. అదే బాబా ప్రత్యేకత. ఐకమత్యమే బలం. దానితో ఎంతటి ఘనకార్యములనైనా సాధించవచ్చుననే సత్యమును విస్మరించరాదు.

## COMPLAINING - EXPLAINING - INSPIRING

"ఈనాడు Explaining తోపాటు Inspiring చేయగల ఉపాధ్యాయులు అత్యవసరం. అయితే ఈనాడు దురదృష్టవశాత్తు Complaining చేసే ఉపాధ్యాయులు ఎక్కువైపోతున్నారు" అని బాబావారు తమ ఆవేదనను వెలిబుచ్చారు. మనదేశంలో ప్రస్తుతం 1. Complaining 2. Explaining 3. Inspiring అను మూడు తరగతుల ఉపాధ్యాయులున్నారని బాబా ఒక పర్యాయం పేర్కొని మొదటి తరగతికి చెందిన ఉపాధ్యాయులు ఎప్పుడూ వ్యవస్థమీదనో, యాజమాన్యంమీదనో, విద్యార్థులమీదనో, సిలబస్ మీదనో విమర్శించడానికి అలవాటు పడ్డారని, రెండవ తరగతికి చెందినవారు పాఠ్యాంశములను క్షుణ్ణంగా చదివి విద్యార్థులకు చక్కగా విశదీకరించి, బోధించేవారని, ఇక మూడవ తరగతికి చెందిన ఉపాధ్యాయులు విద్యార్థుల హృదయాలను చక్కగా ఆకట్టుకొని పాఠములను చెబుతూ వారిని ఉత్సాహపరుస్తూ ఉత్తేజపరిచేటటువంటి ఉత్తమశ్రేణికి చెందిన ఆదర్శ ఉపాధ్యాయులని బాబా పేర్కొనినారు. ఈనాడు అనేక విద్యాలయాలలో అశాంతి చెలరేగటానికి కొందరు ఉపాధ్యాయులు కూడా కారణభూతులు కావటం కడు విచారకరం. అధ్యాపకులు తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించకపోవటం వలన విద్యార్థులలో క్రమశిక్షణా రాహిత్యం పెచ్చుపెరిగిపోతున్నది. భవిష్యత్తుకు రాచబాట వేయువారు విద్యార్థులే గదా! కనుక వారిని తీర్చిదిద్ది ఉత్తమ పౌరులుగా తయారు చేయవలసిన బాధ్యత ముఖ్యంగా అధ్యాపకులదే. కనుక అధ్యాపకులు, విద్యార్థులకు మార్గదర్శకులుగా ఉండాలి.

## CONCENTRATION - CONTEMPLATION - MEDITATION

మీ జీవితం ఒక గులాబీ చెట్టులాంటిది. లౌకిక సంబంధాలే దాని కొమ్మలు. మీ గుణాలే ఆచెట్టుకున్న ఆకులు. మీ బంధాలు, కోరికలూ ఆ కొమ్మకున్న ముళ్ళు, ఆ చెట్టుకు పూసే పుష్పమే ప్రేమ పుష్పము. చెట్టుకున్న కొమ్మల కంటె, ముళ్ళకంటె,

ప్రత్యేకంగా ఉన్న పువ్వును గుర్తించే వివేకశక్తియే Concentration (ఏకాగ్రత). పూవును ప్రత్యేకంగా గమనించి, ముళ్ళు గుచ్చుకోకుండా, కొమ్మనుండి, ఆకులనుండి ఆ పూవును నిపుణంగా కోయటమే Contemplation (చింతనం). చింతనం అంటే నిస్సంగత్వం. దానివలన పూవుకు చెట్టుకు సంబంధం తొలగిపోతుంది. అంటే మనలోని ప్రేమభావం - భవబంధాలకు విషయవాంఛలకు దూరమై పవిత్రమౌతుందన్నమాట. అప్పుడు పూవు నీచేతిలో ఉంటుంది. అంటే నీవు ప్రేమ తత్త్వాన్ని ఉపాసించే అనన్యచిత్తంతో ఉన్నావన్నమాట. ఆ గులాబీపూవును భగవంతునికి అర్పించు. అలా సమర్పించిన తరువాత ఆ పూవు పూసిన చెట్టూ లేదు. పూవు కోసిన చేయి లేదు. అర్పించబడిన పూవూ లేదు. ఉన్నది ఒక్క భగవంతుడే. అంటే పరమాత్మతో అద్వైతభావాన్ని పొందావన్నమాట. అట్టి అద్వైత స్థితియే Meditation (ధ్యానము). ధ్యానించేవాని దేహమూ, ధ్యానించే మనస్సూ ధ్యానమూ అనే మూడు ఒక్కటిగా భాసించే స్థితిని కలిగించేది 'ధ్యానము' (Meditation). ఆ స్థితిలో సాధకునికి అంతఃశాంతి, ఆనంద స్థితి లభిస్తాయంటారు బాబా.

## COMPUTER - COMPOSER

ఈనాటి విద్యలు మానవుణ్ణి Computer గా తయారు చేస్తున్నాయి. జీవితమంతా Computer మయమైపోయింది. కాని మనిషిని Composer గా తయారు చేయాలిగాని Computer గా కాదు. అసలు ఈ Computer ను తయారు చేసింది ఎవరు? Composer కదా! కాబట్టి నీవు Composer గా తయారు కావాలిగాని Computer గా తయారు కాకూడదు. అప్పడే విద్యయొక్క విజ్ఞాన తప్పక అర్థమవుతుంది. Computer అన్ని పనులు చేస్తుందని ఈనాడు భావిస్తున్నారు ఇది చాలా పొరపాటు. మనం అందించేదే అది చేస్తుంది. Where is My Wife? అని అడిగితే అది సమాధానం చెబుతుందా? చెప్పదు. మనం దానిలో Feed చేస్తేనే అది చెబుతుంది. పూర్వం మన Brain 'కంప్యూటర్'గా పనిచేసేది. ఈనాడు Calculator లేకుండా ఏ పనీ చేయలేకపోతున్నాం. భగవంతుడు ప్రసాదించిన మెదడును ఈనాడు మనం ఏ మాత్రం ఉపయోగించటం లేదు. స్వశక్తిని మనం ఏ మాత్రం వినియోగించటంలేదు. పరాధీనమైన జీవితాన్ని గడుపుతున్నాం. మనం స్వయం జీవనమును గడపాలి. ఇతరుల సహాయం మీద ఆధారపడవద్దు." అని భగవాన్ బాబా హితవు పలికారు. ఇది యదార్థం. ఈనాడు స్వశక్తిని ఏ మాత్రం ఉపయోగించుకోవటం లేదు. Computer గనుక చెడిపోతే మన గతి అధోగతి అయిపోతున్నది. అవసరమైన దానికి Computers ను ఉపయోగించవచ్చు అయినదానికి కానిదానికి, ప్రతి చిన్నపనికి Computer మీద ఆధారపడటం మాత్రం విజ్ఞత అనిపించుకోదు.

## DEVOTION - DEEP OCEAN

"Devotion (భక్తి)లేని బ్రతుకు Ocean (మహాసముద్రము)తో సమానం. Devotion (భక్తి) అంటున్నాము. కాని Deep Ocean (సంసారసాగరం)లో ఉంటున్నాము. Divine (దైవ సంబంధం) అంటాము కాని ఉండేది Deep Wine (గాఢమైన మత్తు) లో ఉంటున్నాము" అని ఒక పర్యాయం బాబా చక్కగా చమత్కరించారు. ఇది చమత్కారం కాదు. ఈనాటి వాస్తవ పరిస్థితి ఈ విధంగానే ఉన్నది. ఒక చంప 'మేము భక్తులం....' అని చెప్పకుంటూనే సంసారసాగరంలో మునిగితేలుతూ ఉన్నారు. దైవకార్యాల పేరుతో త్రాగితందనాలు త్రొక్కుతున్నారు. భక్తి పేరుతో భగవంతుని అడ్డం పెట్టుకొని ప్రజలను మోసం చేస్తున్నారు. అందువలన మానవత్వం, ప్రేమతత్త్వం లేని భక్తి అసలు భక్తే కాదన్నారు బాబా. ఈనాడు 'భక్తి' ఆడంబరంగా తయారైంది. 'భక్తి' అంటే పూజామందిరాలలో దేవతామూర్తులకు ఆడంబరంగా పూజలుచేయుటంకాదు. దివ్యత్వంమీద పరమప్రేమను పెంచుకోవటమే భక్తి అంటూ "శరీరపోషణకు ఆహారము ఎంతముఖ్యమో, హృదయపోషణకు 'భక్తి' అంత ముఖ్యము. భగవదానుగ్రహ ప్రాప్తికి భక్తి మార్గం ఒక్కటే శరణ్యం" అంటారు బాబా. కనుకనే 'డివోషన్'లేని బ్రతుకు 'ఓషన్'తో సమానం అన్నారు బాబా.

## DOG - GOD

మనిషియొక్క ఆలోచనలను కుక్కలు కూడా పసిగడుతున్నాయి. కాని మనిషి మాత్రం తన ఆలోచనలను తానే కనిపెట్టడంలేదు అని బాబాగారు చెబుతూ ఒక చిన్న ఉదాహరణ చెప్పారు. ఒక కుక్క 20 అడుగుల దూరంలో ఒక గుంటలో పడుకొని ఉన్నది. నీవు సహజంగా దానిని గురించి ఆలోచించకుండా, దానిని దాటివెళ్ళు. అది ఏమాత్రం అభ్యంతరం పెట్టదు, లేచిపోదు. దానిని కొట్టాలని సంకల్పించుకొని చిన్న రాయిని తీసుకొనిపో! నిన్ను అల్లంత దూరంలోనే చూచి అదిలేచి పరుగెత్తుతుంది. నీ సంకల్పాన్ని అది గుర్తించిందన్నమాట! మానవుడి సంకల్పాలను కుక్కలే గుర్తిస్తున్నాయి గాని మనిషి గుర్తించటంలేదు. కనుక నీవు Dogs (కుక్కల) కన్నా హీనమైన వాడవన్నమాట. మనం Dog కాకూడదు. God కావాలి. అంటూ "D" Entrance లో పోవద్దు, "G" Entrance లో పో! అని చెప్పారు భగవాన్ బాబా!

## EDUCATION - AGITATION

ఈనాడు Education (విద్య) అంటూ Agitation (ఆందోళన)ను

ప్రేరేపిస్తున్నారు కొందరు గురువులు. Agitation కాదు Elevation. (ఔన్నత్యము) ను ప్రదర్శించాలి అని అంటారు బాబా. ఈనాడు కొన్ని విద్యాలయాలలో అశాంతి ప్రబలటానికి కారకులు అధ్యాపకులే అవటం మిక్కిలి దురదృష్టకరం. కొన్ని కొన్ని సందర్భాలలో విద్యార్థులలో క్రమశిక్షణా రాహిత్యం పెచ్చుపెరిగిపోవటానికి కారణ భూతులవుతున్నారు అధ్యాపకులు. ముఖ్యంగా అధ్యాపకులలో పరివర్తన రావాలి. ఒక విద్యార్థి చెడిపోతే పెద్ద ప్రమాదం లేదుకాని ఒక ఉపాధ్యాయుడు కనుక తన విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించకపోతే వేలాదిమంది విద్యార్థులు చెడిపోయే ప్రమాదం ఉన్నది. కనుక విద్యార్థులకు మార్గదర్శకులుగా ఉండాలి అధ్యాపకులు. అధ్యాపకులు ఆచరించి, అనుభవించి పిల్లలకు అందించాలి. 'ఆచార్యుడు' అనే పేరు సార్థకం చేసుకోవాలి. ఆచరించేవాడు ఆచార్యుడు. ఆచరించకుండా ఆచార్యుడనిపించు కోవాలనుకోవటం కేవలం Artificial (కృత్రిమమైన) జీవితమే అవుతుందంటారు బాబా. విద్యార్థులను ఆందోళన వైపునకు మరలించకుండా వారికి నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక, శీలసంపత్తులను ఇనుమడింపజేసే Education ను అందిస్తూ వారిని Elevate చేయాలి అధ్యాపకులు.

## *ELECTION - SELECTION*

"విద్యార్థులలో నాయకత్వం Election (ఎన్నిక) ద్వారా కాదు Selection (ఎంపిక) ద్వారా ఉండాలి" అని అంటారు బాబా. విద్యార్థులలో నాయకత్వ లక్షణాలను పెంపొందించవలసిన బాధ్యత ఎంతైనా ఉన్నది. అయితే క్రమశిక్షణలేని నాయకత్వం వలన ప్రయోజనం లేదు. సత్ప్రవర్తన (Good Character) లేని నాయకత్వం అత్యంత ప్రమాదకరం. కాలేజీలలో ఎన్నికల వలన క్రమశిక్షణా రాహిత్యం పెచ్చుపెరిగి పోతున్నట్లయితే అసలు ఎన్నికలే జరుపకుండా ఉంటే మంచిది. మంచి మార్కులు, ర్యాంకులు సంపాదించుకునే వారి నుండి; సంగీత, సాహిత్య, నృత్యకళలలో ప్రావీణ్యత పొందిన వారి నుండి; Games & Sports లలో ప్రతిభను చూపేవారినుండి మరియు సత్ప్రవర్తన గల విద్యార్థులనుండి మాత్రమే నాయకులను Select చేస్తే ఆందోళనలు ఉండవు, అవినీతికి అవకాశమే ఉండదు. క్రమశిక్షణతో కళాశాలలు మంచిగా నడుస్తాయి. శ్రీ సత్యసాయి విద్యాసంస్థలే దీనికి తార్కాణం, మంచి ఆదర్శం.

## *ENJOY - END JOY*

ఈ దేహము ఒక రథము వంటిది. దీనిలో దేవుడు ఆత్మస్వరూపుడై ఉన్నాడు. భగవంతుని ఊరేగింపే ఈ జీవితం. దేహం Negative, దేవుడు positive. ఈ రెండూ చేరినప్పుడే Life అనేది Enjoy అవుతుంటుంది. విద్యార్థులు ఈ పదాన్ని

తెలుసుకోవాలి, అర్థం చేసుకోవాలి. ఏం చేస్తున్నావు? అంటే నేను యిక్కడ చాలా Enjoy చేస్తున్నానంటారు. Enjoy అంటే అర్థం మాత్రం తెలియదు గాని I am enjoying very much అంటారు. కాని అది Enjoy కాదు. మనం సాధించవలసింది End-Joy. అంత్యములో Joyful (ఆనందం)గా ఉండాలి. జీవిత కాలములో చేసిన దైవస్మరణ అంత్యకాలములో అక్కరకు వస్తుంది. ఈ Enjoy అంతా ప్రాకృతమైనటువంటిది. క్షణభంగురమైనటువంటిది. కాని End-Joy శాశ్వతమైనటువంటిది. కాబట్టి మనం కోరుకోవలసింది Enjoy మాత్రమే కాదు End-Joy . దీని కోసం ప్రాణం ఉన్నంత వరకు భగవత్ చింతన చేయాలి. కేవలం చింతన చేసి ప్రయోజనం లేదు. దైవకార్యములలో కూడా పాల్గొనాలి. చింతన మనసుతో చేయాలి. కార్యం కాయంతో చేయాలి. ఈ రెండింటి వలననే ఆత్మానందం మనకు ప్రాప్తిస్తుందంటారు భగవాన్ బాబావారు.

## FASHION - COMPASSION

"మానవునిలో ఉండవలసిన సద్గుణం దయ (Compassion) అయితే ఈనాడు మానవునిలో Compassionకు బదులు Fashions పెరుగుతున్నాయి." అని అంటారు బాబా. ఎదుటివాని కష్టాలను చూచినప్పుడు నీ హృదయం ద్రవించాలి. అట్టి దానినే Compassion అంటారని చెబుతూ "దయగల హృదయమే దైవ మందిరము" అన్నారు బాబా. నిరుపేదల కష్టాలను చూచి వలవల ఏడ్చేవాడే మహాత్ముడు అంటారు స్వామి వివేకానంద. అయితే ఈనాటి యువతరంలో ఫ్యాషన్స్ పేరుతో అనుకరణ (Imitation) పెరిగిపోతున్నది. "అనుకరణ నాగరికత కాదు, అది అభ్యున్నతికి లక్షణం కాదు. మానవుని యొక్క ఘోరమైన పతనానికి అది చిహ్నం" అన్నారు వివేకానంద. ఈనాడు ఫ్యాషన్స్ పేరుతో యువతీయువకులు, అందవికారమైన దుస్తులను ధరించి సిగ్గు, లజ్జ, అభిమానం లేకుండా బజార్లవెంబడి తిరుగుతున్నారు. నాగరికత పేరుతో కోరికలకు బానిసలవుతున్నారు. కోరికలు తీరక, నెరవేరక, మనశ్శాంతిలేక అసంతృప్తితో జీవితాలను గడుపుతున్నారు. అక్రమ, అనాచార, అవినీతి పద్ధతులకు దిగజారుతున్నారు. ఫ్యాషన్స్ వ్యామోహంలోపడి పతనమై పోతున్నారు. దైవీగుణమైన 'దయ'ను విస్మరిస్తున్నారు. ఇది ఈనాటి దురవస్థ.

## FOOD - HEAD

దేహమునకు ఆహారం మూలం. ఈ ఆహారము సాత్వికమైనదిగాను, సత్ప్రవర్తనతో ఆర్జించినదిగాను, భగవదర్పితముగాను ఉండాలంటూ "తుచ్ఛమైన మాంసము తిని, వాటి బుద్ధులను మనం ఎందుకు పెంచుకోవాలి.? ఆ విధంగా

తింటే మనం Animals గా తయారైపోతాం. Food ఎట్లానో Head అట్లా! Head ఎట్లానో God అట్లా! Food, Head, God- ఈ మూడింటికి సంబంధం ఉంటుంది" అని అంటారు బాబా. సాధకునకు సాత్త్వికమైన ఆహారం ప్రాణసమానం. మితంగా తినాలి. 'మిత తిండి అతి హాయి' అన్నారు గదా! Over Load చేస్తే ఆరోగ్యం దెబ్బతింటుంది. 'ఆరోగ్యమే మహాభాగ్యం కదా!' ఇకపోతే చేపలు తింటే చురుకుదనం పెరుగుతుందంటున్నారు డాక్టర్లు. కాని అవి Bad Thoughts (చెడ్డ ఆలోచనలు) ను కలుగచేస్తాయి. మన తిండిని బట్టే మన ఆలోచనలుంటాయి. మన మాటలకు, మన చేతలకు మూలం మన ఆలోచనలే గదా! కనుక మన ఆలోచనలు పవిత్రమైనవిగా ఉండాలంటే మనం పరిశుద్ధమైన, సాత్వికమైన ఆహారమును మితంగా భుజించాలి. మన ఆలోచనలు పవిత్రంగా, నిర్మలంగా, ఉన్నతంగా ఉన్నప్పుడు మనం దైవచింతనలో నిమగ్నం కాగలుగుతాం. అందువలననే Food ను బట్టి Head, దానిని బట్టి God ఉంటాడన్నారు భగవాన్ బాబావారు.

## *FOOD - HEAD - HEART*

మానవునికి Head, Heart రెండూ ముఖ్యం. ఈ రెండూ Body (దేహం) లో ఉండినటువంటివి. Head is Education, Heart is Health. కనుక Health and Education లు Body కి కావాలి. ఎలాంటి Health? కేవలం జీవించటం కోసమే Health కాదు, సేవ చేయటంకోసం Health కావాలి. Service చేయటంకోసం దేహం ఆరోగ్యంగా ఉండాలి. ఇకపోతే మనకు Head ఉండాలి. ఎలాంటి Head ఉండాలి.? పరుల, చింతన చేసి, పరులను దూషించి, పరులను విమర్శించేటటువంటి Head కాదు. భగవంతుని సదా చింతించేటటు వంటి Head ఉండాలి. Head is Education కదా! ఎటువంటి Education ఉండాలి? కేవలం చదవటం వ్రాయటం మాత్రమేకాదు. చదువుతోపాటు సంస్కారం, విద్యతో వినయం పెంపొందించే Education కావాలి. ఇకపోతే Food ను బట్టి Head, Health ఉంటాయి కనుక ఎటువంటి Food ను మనం తీసుకోవాలి? పరిశుద్ధమైన, సాత్వికమైన, శాకాహారమును మితంగా భుజిస్తే ఆరోగ్యం బాగుంటుంది. ఆరోగ్యవంతుడు మాత్రమే సరియైన రీతిలో ఆలోచించగలుగుతాడు. అసలు Food ఎందుకోసం? శరీరమును కాపాడుకోవటానికోసం. ఎటువంటి Food కావాలి. సద్గుణాలను అభివృద్ధి పరచుకోవటానికి దోహదం చేసే సాత్వికాహారమును తీసుకోవాలి. సద్గుణములు ఎందుకు? సమాజసేవలో పాల్గొనటానికి, పరులకు సహాయం చేయటానికి, సమాజానికి సత్కీర్తి తేవటానికి సద్గుణములు దోహదం చేస్తాయి. "మానవునికి Head, Heart ముఖ్యం. ఈ రెంటికీ Food ఆధారం. కనుక Food ను బటి Head, Heart. వాటినిబట్టి God ఉంటాడు" అని చెప్పారు బాబా.

## FRUIT - ROOT

"జీవితమనే వృక్షం(Tree), ఆత్మవిశ్వాసమనే వేళ్ళు (Roots) శీలమనే ఫలము (Fruit) తోను కూడి ఉంటుంది. ఈ Fruit (ఫలము), Roots (వేళ్ళు) రెండూ లేకపోతే, అది మామూలు వంటచెరుకు (Fire Wood) మాత్రమే అవుతుంది. కాని వృక్షం మాత్రం కాదు (Not Tree)" అంటారు బాబా. కనుక మొట్టమొదట ప్రతి ఒక్కరు ఆత్మవిశ్వాసమును పెంచుకొని, తదుపరి మోక్షమనే ఫలమును అందుకోవటానికి తగిన ప్రయత్నం చేయాలి. అప్పుడే జీవితంలో విజయాన్ని సాధించగలుగుతారు.

వృక్షములో ఉండినటువంటి ఫలములే మనకు ప్రధానమైనప్పటికీ, ఆ వృక్షములో ఉన్నటువంటి ఆకులు, రెమ్మలు, కొమ్మలను మనం ఏరీతిగా పోషిస్తున్నామో, అదేవిధముగనే 'ఆత్మ' మనకు ధ్యేయమయినప్పటికినీ, దీనికి సంబంధించిన దేహము, మనస్సు, బుద్ధి, చిత్తము అనేటటువంటి వాటిని కూడా మనం సాధనలో ఉంచుకోవాలంటారు బాబా. ఈ ప్రకృతి అనే వృక్షమునందు 'మోక్షము' అనే ఫలమును మనం ఆశిస్తున్నాము. ఆ వృక్షమునందు బంధు బలగమనే కొమ్మలు (Branches) కోరికలు (Desires) అనే పుష్పములు, మోక్షమనే ఫలములు (Fruits) ఉన్నాయి. మోక్షమనే ఫలము మనకు లభించాలంటే కేవలం కొమ్మలకు, రెమ్మలకు నీరుపోస్తే ప్రయోజనం లేదు. మనకు కనిపించనటు వంటి వ్రేళ్లకు (Roots) నీరుపోయాలి. ఎరువు వేయాలంటారు బాబా. అనగా 'ప్రేమ' అనే జలము పోయాలి. ఆ వ్రేళ్ళే ఆత్మ విశ్వాసం. ఆత్మవిశ్వాసమనే వ్రేళ్ళపైననే ఈ ప్రకృతి అను ఫలవృక్షము ఆధారపడి ఉంటున్నది. ఈ మోక్షమనేటటువంటి తియ్యని ఫలములు, తియ్యని మధురమైన రసమే మన శీలము (Character) అంటూ "సచ్ఛీలమే ధనము, సదాచారమే సంపద" అని పేర్కొనినారు బాబా. కనుక విద్యార్థులు సచ్ఛీలసంపన్నులు కావాలని, విద్యావినయశోభితులుగా వెలుగొందాలని బాబా వారి ఆకాంక్ష

## GOOD WORK - GOD'S WORK

"సేవ అంటే చాలామంది 'సత్కర్మ' (Good Work) అని భావించి చేస్తుంటారు. కాని సాయిసేవకులు మాత్రం (God's Work) (దైవము యొక్కపని)గా భావించి సేవలు చేస్తుంటారు." అని చెప్పారు భగవాన్‌సాయి. ఈనాడు చాలామంది పేరు కోసం సేవ చేస్తుంటారు. సేవలకు ఖర్చు చేసే దానికన్నా దాని ప్రచారమునకు ఎక్కువగా ఖర్చుచేస్తుంటారు. కాని స్వామి దీనిని అంగీకరించరు. ప్రచార

ఆర్భాటములకు ప్రాధాన్యతయివ్వరు. సేవ నిమిత్తం ఖర్చు చేయదలచిన సొమ్ము మొత్తం దానికి అర్హతగలవారికే అందాలని స్వామి భావన. అంతే కాదు కేవలం మంచిపని అని భావించి చేస్తే, అంత Perfect గా చేయలేరు. అదే దైవం పని చేస్తున్నామనే భావన వుంటే జాగ్రత్తగా వళ్ళు దగ్గర పెట్టుకొని చేస్తారు. స్వామి ఆశించేది సానుభూతితో కూడిన సేవకాదు. కేవలం కుంటి గ్రుడ్డికి సేవచేస్తున్నామనే భావనతో చేస్తే దానిలో పవిత్రత వుండదు. ఆ కుంటి, గ్రుడ్డిలో నున్న పరమాత్మకు సేవచేస్తున్నామనే భావన మనలో వుంటే అట్టి సేవ, యోగంగా మారుతుంది. నైతిక సానుభూతికన్నా అన్ని విధాలా ఉన్నతమైనది ఆధ్యాత్మిక ప్రేమ. అది కేవలం సానుభూతిగానే కాక పరివర్తనను సాధించగల దివ్యశక్తిగా రూపొందుతుంది. 'మానవసేవయే మాధవసేవ' అని సేవలు చేసినప్పుడు మాధవుణ్ణి మానవునిలోనే చూడగలుగుతాం. ప్రతిఫలాన్ని ఆశించకుండా చేసే సేవ పవిత్రమవుతుంది. కనుక సేవ మంచిపని మాత్రమే కాదు, దైవం పని అనే భావనతో చేయాలి.

## HAPPY - HEALTHY

నీవు Healthy గా వున్నప్పుడే Happiness ను అనుభవించగలుగుతావు. Health సరిగాలేనివానికి Happy కూడా ఉండదు. **'ఆరోగ్యమే మహాభాగ్యం కదా!'** కనుక మనం ఆరోగ్యమును మొట్టమొదట కాపాడుకోవాలి. Happy గా వుండినప్పుడే పదిమందికి Happy ని అందించగలుగుతాం. ఈ Happy ఎక్కడ నుంచి వస్తుంది? Happiness Lies in the Union With God. భగవంతుని నామం చేతనే ఈ Happiness లభిస్తుంది. కనుక హృదయంతో కూడినటువంటి నిజమైన కర్మలు ఆచరిస్తూ రావాలి. అప్పుడే మనకు ఏ విధమైన రోగములు రావు. రోగములు రావటంచేత అశాంతి పెరుగుతుంది, ఆనందం తరుగుతుంది. కనుక Healthy గా ఉండాలి, Happy గా ఉండాలి" అని అంటారు భగవాన్ బాబా. కనుక మన హృదయంలో ఏమాత్రం చెడ్డ భావములు ప్రవేశించకుండా చూచుకోవాలి. ఎవరిపైన ద్వేషమును పెంచుకోకూడదు. ద్వేషం పెంచుకుంటే అశాంతి ప్రబలు తుంది. అశాంతి ప్రవేశిస్తే ఆనందానికి దూరమవుతాం. ఆనందం కరువైతే ఆరోగ్యం దెబ్బతింటుంది. అనారోగ్యపరుడు ఏ సాధనలూ చేయలేడు.

## HEAD - HEART - HAND

"ఆధ్యాత్మికము Heart, సైన్స్ & టెక్నాలజీ Head, ధర్మము Hand కనుక ఈ Three "H" లను మనం అభివృద్ధి పరచుకోవాలి" అని బాబా చెప్పారు. అనగా మొదట బుర్రతో ఆలోచన చేయాలి. తరువాత హృదయంతో పరిశీలన చేయాలి.

తదుపరి చేతులతో ఆచరించాలి. "ఆలోచన, పరిశీలన, ఆచరణ" - దీనినే "త్రికరణశుద్ధి" అన్నారు. ఈ "త్రికరణశుద్ధి" కలిగినప్పుడు 'జ్ఞానసిద్ధి' కూడా మనకు లభ్యమవుతుందని చెబుతూ ఈ మూడు 'H'లకు చక్కటి ఉపమానం చెబుతూ. "Head of Sankara, Heart of Buddha, Hand of Janaka. శంకరుని మేధస్సు, బుద్ధుని హృదయం, జనకుని హస్తం- మీ స్వంతం చేసుకోండి! పూర్ణమానవులు కండి" అంటారు బాబా. కనుక ఈ మూడు 'H'ల సూత్రమును అమలుపరచి మానవత్వంగల సంపూర్ణ మానవులమవుదాం.

మానవజీవితంలో Head, Heart రెండూ ప్రధానమైనవి. ఈ Head నుండి జగత్తంతా పుడుతున్నది. కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యములనే అరిషడ్వర్గములు ఈ Head నుంచే పుడుతున్నాయి. Working, Walking, Writing అన్నీ కూడా Head నుండే వస్తున్నాయి. సమస్త విద్యలూ Head నుండి వచ్చినటువంటివే. ఏనాటికైనా ఇవన్నీ అంతర్ధానమయ్యేవే. కానీ Heart నుండి వచ్చేవి చాలా పవిత్రమైనవి. అవే ప్రేమ, సహనం, శాంతం, సత్యం. అదే అంతఃకరణ స్వభావమంటూ "ఈనాటి మానవుడు హృదయాన్ని (Heart) పెంచుకునేందుకు ప్రయత్నించాలి కాని తలలు (Heads) పెంచుకునేందుకు కాదు" అని అంటారు బాబా. ఈ Head అనేది కేవలం ప్రాకృతమైన జీవితాన్ని గడపటానికి ప్రయత్నిస్తుంది. Heart పరతత్త్వ జీవితాన్ని గడపటానికి ప్రయత్నిస్తుంది. ఈ Heart అంటే ఎడమవైపున ఉండే Physical Heart కాదు. అది కుడివైపున ఉంటుంది. అది ప్రేమకు స్థానం. అది విశాలం కావాలంటూ "ఎడమవైపున ఉండే Physical Heart కాదు, అది విశాలమైతే (Enlarge) హాస్పిటల్‌లో చేరుస్తారు" అని ఒక పర్యాయం చమత్కరించారు బాబా. మనం చేసే సాధనలతో హృదయం కరగాలి, కరిగిన హృదయం కదలాలి. హృదయవేదనను పెంచాలి, పదిమందికి పంచాలి. అప్పుడే మన జీవితం సార్థకమవుతుంది.

ఆనందం(Bliss) హృదయం(Heart) నుండి వస్తుంది. సంతోషం (Joy) తల (Head) నుండి వస్తుంది. తల కేవలం Responsibility ( బాధ్యత) మాత్రమే. Heart మాత్రమే Right (హక్కు) . కనుక ప్రతి మానవునికి తల, హృదయం రెండూ ప్రధానమంటూ 'మంచిని యోచించు, యోచించిన దానిని మంచిగా తలంచు, తలంచినదానిని హస్తములలో పెట్టుకొని ఉపయోగించు,' అని అంటారు బాబా. కనుక మనం మంచినే చూద్దాం, మంచినే తలుద్దాం, మంచినే చేద్దాం - ఇదే మానవత్వానికి పునాది.

## HERO - ZERO

"Hero becomes zero, if he forgets God (దేవుని విస్మరిస్తే హీరో కూడా 'జీరో' అయిపోతాడు)" అంటారు బాబా. ఇది వాస్తవం. భగవంతుని విస్మరిస్తే ఎందుకూ పనికిరాని అనామకుడైపోతాడు. ఒక పర్యాయం బాబా 'ఏకాదశి'కి చక్కటి నిర్వచనం చేసారు. 'ఏకాదశి' పదముయొక్క నిజార్థము 'దశములో ఏకము' అనిగాని పదకొండు కాదని చెప్పారు. దశము అనగా పది (10). దానిలో ఏకము ఒకటి (1) ఆ ఒకటి (1) అనేది భగవంతుడు. దాని తరువాత వచ్చేది సున్న ('0') ప్రకృతి, ప్రపంచం, సృష్టి, ఆ ఒకటి ('1') Hero. తరువాత వచ్చే సున్న ('0') Zero. అంటూ "జీరోను త్యజించి, హీరోను భజించు అనేదే ఏకాదశియొక్క దివ్యప్రబోధము" అని అంటారు బాబా. మరో "ప్రసంగంలో" వేదికలమీద హీరోలు, నిజజీవితంలో మాత్రం జీరోలు" అని బాబా చమత్కరించారు. ఈనాడు ఊక దంపుడు ఉపన్యాసాలు వింటూనే ఉన్నాముగదా! ఆచరణలో పెట్టని ఉపన్యాసాలు నిష్ప్రయోజనం.

## HEALTH - WEALTH

"తల్లిదండ్రుల ఆశీర్వాదమే నీ Wealth (సంపద). అదియే నీ Health (ఆరోగ్యం). Health, Wealth తల్లిదండ్రుల ఆశీర్వాద ఫలితమే. తల్లిదండ్రుల సేవయే భగవంతునిసేవ, భగవంతుని దగ్గరకు మనం పోవటం కాదు. భగవంతుడినే మన దగ్గరకు తెప్పించుకోవాలి. ఆ విధమైన శక్తి సామర్థ్యములను మనం సంపాదించుకోవాలి. ఎవరినైనా వదులుగాని తల్లిదండ్రులను మాత్రం వదలకు. వారిని ఆశ్రయించు, ఆరాధించు, వారి ఆశీర్వాదములను నీవు అందుకో. తల్లిదండ్రుల ఆశీర్వాదమును అందుకొనిన అభివృద్ధి గాంచవచ్చును" అని విద్యార్థులకు ప్రత్యేకంగా హితబోధ చేశారు భగవాన్‌సాయి. ఇది భావితరాలకు అత్యంత ఆవశ్యకమైన సుబోధ. తల్లిదండ్రుల సేవలో నిమగ్నుడైన పుండరీకునికి పాండురంగడే స్వయంగా వచ్చి దర్శనమిచ్చి ఆశీర్వదించలేదా? తల్లిదండ్రులకు సేవచేసి ధర్మవ్యాధుడు ముక్తిని పొందలేదా? గ్రుడ్డివారైన తల్లిదండ్రులను సేవించిన శ్రవణకుమారుడు తరించలేదా? ఇంకా.. ఇంకా.. ఎందరో.. ఎందరో.. తల్లిదండ్రుల సేవచేసి తరించినవారున్నారు. కనుక భగవాన్ సాయి హితబోధను ఆచరణలో పెట్టి తల్లిదండ్రుల ఆశీర్వాదములు పొంది తరిద్దాం.

## HELP - HURT

"భగవంతుడు ఒక్కడే నీకు నిజమైన స్నేహితుడు (Real Friend). భగవంతుడు ఎల్లప్పుడూ Help (సహాయం) చేసేవాడేగాని Hurt (బాధించు)

చేసేవాడు కాదు. ఇటువంటి Real Friend ను నమ్ముకోకుండా, హలో! హలో! అంటూ వెంట తిరిగే వారినే ఈనాడు నమ్ముతున్నారు. ఇటువంటివారు మన దగ్గర డబ్బు ఉన్నంత వరకు మన వెంట తిరుగుతుంటారు. ఆ డబ్బు అయిపోయేటప్పటికి హాలో (Hallow) అయిపోతారు. తరువాత కనిపించరు. అదికాదు నిజమైన స్నేహితము. నీ వెంట, జంట, ఇంట ఎల్లప్పుడూ వుండేటటువంటివాడే నిజమైన స్నేహితుడు. అతడు ఒక్క భగవంతుడే కాని ఈనాటి స్నేహితులందరూ, డబ్బు జేబులో ఉన్నంత వరకూ, తండ్రి ఉన్నత స్థితిలో ఉన్నంత వరకూ వెంట ఉంటారు. తండ్రి Retire అయిపోయేటప్పటికి ఎక్కడా కనిపించరు. చెరువులో నీళ్ళున్నంతవరకు కప్పలు ఉంటాయి. చెరువు ఎండిపోయేటప్పటికి, అక్కడ ఒక్క కప్ప కూడా కనిపించదు. ఈనాటి Friendships (స్నేహాలు) కూడా అటువంటివే. భగవంతుని స్నేహం మాత్రం అటువంటిది కాదు" అని అంటారు భగవాన్ సాయి. కనుక నీ వెంట, జంట, ఇంట ఎల్లప్పుడూ వుంటూ Help చేసేటటువంటి భగవంతుని మనస్ఫూర్తిగా ప్రేమించాలి. Hurt చేసేటటువంటి స్వార్థపరులకు దూరంగా వుండాలి. విశ్వాసంతో నమ్ముకొనిన ప్రహ్లాదుని భగవంతుడు కాపాడలేదా? కనుక Help Always others, But do not Hurt others.

## HOLIDAY - HOLYDAY

"పండుగలు Holidays కావు Holydays. (పండుగలు శెలవు దినములు కావు. పర్వదినములు)" అని అంటారు బాబా. అయితే ఈనాడు దురదృష్టవశాత్తు ఇటువంటి పవిత్రమైన భావన చాలామందిలో లేకుండా పోయింది. పర్వదినాలు సెలవు దినాలుగా భావించి 'పిక్‌నిక్' లకు వెళ్ళటం పరిపాటైంది. పార్టీలు చేసు కుంటున్నారు. శివరాత్రి జాగరణ పేరుతో పేకలు ఆడుతున్నారు, తాగు తున్నారు. తందనాలు త్రొక్కుతున్నారు. ఇది మారాలి. ఈ భావన మారాలి. ఈ ఆలోచనా సరళి మారాలి. పండుగ దినాలు పర్వదినాలుగా భావించి, నిర్మలచిత్తంతో కొద్దిసేపైనా భగవంతుని స్మరించాలి. పవిత్ర హృదయంతో భగవన్నామం చేయాలి. అప్పుడే పర్వదినం (Holyday) యొక్క ప్రాముఖ్యతను సద్వినియోగపరచిన వారమవుతాము.

## HURRY - WORRY - CURRY

"అసంతృప్తో ద్విజో నష్టః" అసంతృప్తి కలిగినవానికి అంతా నష్టములే. అట్టివాడు భుజించే సమయంలో కూడా Worry (వ్యాకులత) అవుతుంటాడు. ఈ Worry వలన Hurry (తొందరపాటు) అధికమైపోతుంది. అసలు మానవుని గుండె

జబ్బులకు ప్రధానమైన కారణములు మూడు 1. Hurry (తొందరపాటు), 2. Worry (వ్యాకులత) 3. Curry (కూర). Curry అనగా ఇక్కడ Fat (క్రొవ్వు పదార్థములు)ను పెంచేవి. అందువలననే గుండెజబ్బు ఉన్నవారికి డాక్టర్లు Weight (బరువు) తగ్గించాలని Advise (సలహా) ఇస్తుంటారని బాబా చెప్పారు. కనుకనే క్రొవ్వు అధికంగా ఉండే పదార్థములను, మత్తుపదార్థములను సేవించకూడదని, 50సం॥లు పైబడినవారు ఆహారమును తగ్గించడం మంచిదని డాక్టర్లు సూచిస్తుంటారు. "ఈనాడు మానవుడు కడుపుకు దాసుడై, నాలుకకు సేవకుడై తన కాళ్ళు చేతులకు తానే సంకెళ్ళు తగిలించుకుంటున్నాడు." అని చెప్పారు బాబా. ఇది వాస్తవం. కనుక బాబా చేసిన సూచనలు ఆచరణలో పెట్టి ఆరోగ్యమును కాపాడుకుందాం.

## *HUMILITY - ELIGIBILITY*

"Humility, Eligibility, Charity, Credibility - ఈ నాలుగు మనిషికి ముఖ్యము" అని బాబా చెప్పారు. Humility అంటే అణకువ, నమ్రత, వినయం అని చెప్పకోవచ్చును. ఇవి ఉంటే Eligibility వస్తుంది. అనగా అర్హత, యోగ్యత లభిస్తుంది. అట్టి దానివలన ఐహిక సంపదను (ధనమును) పొందవచ్చును. అట్టి సంపదను దుర్వినియోగపరచక, దాతృత్వబుద్ధితో దానధర్మాలు చేయాలి. అంటే Charity అభివృద్ధి కావాలి. ఆ దాతృత్వ బుద్ధి వలన మన Credibility పెరుగుతుంది. అనగా నమ్మదగిన మనిషి అని పేరు ప్రతిష్ఠలు వస్తాయి. సమాజంలో గౌరవ మర్యాదలు లభిస్తాయి. దానివలన మనం సుఖమును, ఆనందమును పొందుతాం. ఇదే వాస్తవమును మన మహర్షులు ఈ క్రింది శ్లోకములో వివరించారు.

**"విద్యాదదాతి వినయం, వినయాత్ యాతి పాత్రతామ్**
**పాత్రత్వాత్ ధనమాప్నోతి ధనాద్ధర్మం తతః సుఖమ్"**

విద్య అంటే కేవలం చదవటం, వ్రాయటం మాత్రమే కాదు. "విద్యా వినయ సంపన్నః" అన్నారు గదా! విద్యా వినయములు రెండూ కలిసి ఉన్నప్పడే రాణిస్తాడు, అభివృద్ధిలోకి వస్తాడు. ఈ రెండూ సంపాదించిన వారికి యోగ్యత, అర్హత లభిస్తాయి. తరువాత మంచి పేరు ప్రతిష్ఠలను సంపాదించగలుగుతాడు. ఉన్నత పదవులను అధిష్ఠించగలుగుతాడు. తద్వారా ధనమును సంపాదించగలుగుతాడు. అట్టి ధనమును స్వార్థభూయిష్టమైన పనులకు వినియోగించకుండా దాన ధర్మాలకు వినియోగిస్తే Credibility పెరిగి అత్యున్నతమైన మోక్షమును కూడా పొందటానికి అర్హతను సంపాదించగలుగుతాడు. అప్పడే విద్యయొక్క పరమావధి నెరవేరుతుంది.

ఇదే భావాన్ని బాబా వారు చక్కగా Humility, Eligibility, Charity, Credibility అనే ఈ నాలుగు మాటలలో ఇమిడ్చారు. వాటిని ఆచరణలో పెడితే మనిషి తరిస్తాడు.

## I - EYE

నీలోనున్న దివ్యత్వాన్ని నీవు దర్శించాలి. అదియే Self Realisation (ఆత్మసాక్షాత్కారము). Self అనగా ఏమిటి? ఇక్కడ రెండు రకముల Self లు ఉన్నాయి. ఒకటి ఏకాక్షరము 'I' (ఐ). రెండవది మూడు అక్షరముల 'Eye' (ఐ). నీవు కేవలం మూడు అక్షరముల Eye నే ఆశిస్తున్నావు. మూడు అక్షరముల Eye శరీరము. ఏకాక్షరము 'I' (ఐ) ఆత్మ. నీవు I... I... అంటున్నావే గాని నీవు ఆత్మవా? దేహమా? అనేటటువంటి విచారణ మాత్రం చేయటం లేదు. అదియే సత్యాన్వేషణ. 'I' అనేటటువంటిది ఈ దేహము కాదు. ఈ దేహమునకు My body, My mind, My hand, My face, My Flower. Flower is seperate from Me. Then who am I? అంటాం. ఈ విధమైన విచారణ చేయాలి. దీనినే Discrimination అన్నారు. హృదయ పూర్వకంగా విచారణ చేయాలి. అప్పుడే నిజమైన 'I'ని మనం దర్శించుకోగలం.

## IMITATION - CREATION

"Imitation is Animal Quality, Creation is Divine Quality. అనుకరణ పశుత్వలక్షణం. సృష్టించుట దివ్యత్వలక్షణం. కృత్రిమమైనటువంటి అనుకరణ బలహీనులను గావిస్తుంది" అని చెప్పారు భగవాన్ బాబా. ఈనాడు అనుకరణ వ్యామోహం పెరిగిపోతున్నది. ముఖ్యంగా విద్యావంతులలో విదేశాలపై మోజు ప్రబలుతున్నది. **'పొరుగింటి పుల్లకూర రుచి'** అన్నట్లు ప్రతి చిన్న విషయానికి విదేశాల వైపు చూడటం అలవాటైంది. మంచి ఎక్కడ వున్నా తీసుకోవటంలో పొరపాటు లేదు. కాని దానిని గ్రహించి మన పద్ధతికి అనుగుణంగా మరల్చుకొని జీర్ణించుకోవాలికాని, పరదేశీ భావ ప్రభావాలకులోనై, ఆత్మవంచన చేసుకొని అన్యుడివి మాత్రం కారాదు. ఒక పర్యాయం స్వామివివేకానంద కూడా అదే చెప్పారు. **"అనుకరణ నాగరికత కాదు. అనుకరణ అభ్యున్నతికి లక్షణం కాదు. అది మానవుని అధఃపతనానికి దోహదం చేస్తుంది"** అని అంటారు. కనుక దుర్గలానుకరణ ప్రగతిని సాధించదు.

## INFORMATION - TRANSFORMATION

"అధ్యాపకులు ఒక పుస్తకంగా తయారుకాకూడదు. ఆచరణలో మస్తకాన్ని తయారు చేసుకోవాలి. కేవలం Information (సమాచారం) సేకరించటం కాదు. Transformation (పరివర్తన) తీసుకొనిరావాలి. Reformation చేయగల (సంస్కరించగల) సమర్థులుగా కూడా తయారుకావాలి" అని అంటారు బాబా.

ఈనాడు చాలామంది ఉపాధ్యాయులు గ్రామ్‌ఫోన్ రికార్డు లాగే తయారవుతున్నారు. కేవలం గైడ్స్‌లోనున్న సమాచారమును సేకరించి, తరగతి గదులలో దానిని వల్లె వేస్తున్నారు. వారి బోధనలలో నైపుణ్యంగాని, చైతన్యంగాని ఏమాత్రం కనిపించటం లేదు. అందువలన విద్యార్థులలో ఆశించిన మార్పు కనిపించటం లేదు. అధ్యాపకుల కర్తవ్యం కేవలం సేకరించిన సమాచారమును విద్యార్థులకు అందించటం మాత్రమేకాదు. వారిలో మార్పును తీసుకొనివచ్చే ప్రయత్నం అధ్యాపకులు చేయాలి. అంతేకాదు వారిని సంస్కరించగల సమర్థులైన సంస్కర్తలుగా తయారుకావాలి అధ్యాపకులు. అలనాటి గురువుల స్థాయికి ఎదగాలి ఈనాటి అధ్యాపకులు. అప్పుడే ఈ సమాజం సంస్కరించబడుతుంది. అట్టి మహత్తర ప్రయత్నాన్ని బాబావారు చేబట్టి విద్యాసంస్థలను నెలకొల్పుతున్నారు. వాటిల్లో విద్యను బోధించే అధ్యాపకులకు ముందుగా ఉత్తమశిక్షణను ఇస్తున్నారు. అధ్యాపకుడు నిరంతరం అధ్యయనం చేస్తుంటేనే, విద్యార్థులకు చక్కటి బోధన చేయగలడు. విద్యార్థి అనే నావకు అధ్యాపకుడు చుక్కాని వంటివాడు. చుక్కాని పట్టే వ్యక్తి విజ్ఞతను ప్రదర్శిస్తే నావ ప్రయాణం సాఫీగా సాగిపోతుంది. ఎట్టి ఒడుదుడుకులకు లోనుకాకుండా చేరుకోవలసిన ప్రదేశానికి సకాలంలో చేరుకుంటుంది. అధ్యాపకుల పరివర్తన మీదనే విద్యార్థుల ప్రవర్తన ఆధారపడి ఉంటుందని బాబా గ్రహించి, మొట్టమొదట అధ్యాపకులను తీర్చిదిద్దే ప్రయత్నం చేస్తున్నారు బాబా.

## *MARKS - REMARKS*

"Marks మాత్రమే ప్రధానం కాదు, Marksతోపాటు Remarks రాకుండా చూచుకోండి!"అని ఒక పర్యాయం బాబావారు పిల్లలను హెచ్చరించారు. బాబా చేసే సూచనలు, హెచ్చరికలు పైకి చమత్కారాలుగా కనిపిస్తాయి, వినిపిస్తాయి. అయితే వారు మాట్లాడే ప్రతిమాట వెనుక ఎంతో అంతరార్థం ఇమిడి ఉంటుంది. లోతుకుపోయి పరిశీలిస్తే దానిలో ,నేర్చుకోవలసింది, ఆచరించవలసింది చాలా ఉంటుంది. ఈనాడు తల్లిదండ్రులు తమ పిల్లలకు మార్కులు బాగా వస్తే సంతోషిస్తుంటారు. Remarks ను గురించి అంతగా పట్టించుకోరు. ఈనాడు ఉపాధ్యాయులు కాని, తల్లిదండ్రులుగాని మార్కులమీద శ్రద్ధ తీసుకుంటున్నారుగాని, పిల్లల ప్రవర్తనమీద చూపించవలసినంత శ్రద్ధను చూపించటం లేదు. మార్కులకు ప్రాధాన్యతనిస్తున్నారుగాని ప్రవర్తనకు ఇవ్వటంలేదు. అందువలననే బాబావారు "నేటి విద్యలు తెలివితేటలనే పెంచు, కొంచమైన గుణము పెంచబోదు" అన్నారు. కనుక ప్రతి విద్యార్థి మార్కులు బాగా సంపాదించాలి, రిమార్కులు రాకుండా చూచుకోవాలి.

## NEAR, DEAR - DISAPPEAR

పొయ్యికి ఉండిన మూడు రాళ్ళు సత్త్వ, రజో, తమో గుణములు. దానిపైన పెట్టిన పాత్ర దేహము. ఇందులో పోసిన జలము ప్రేమజలము. దీనిలో పోసినది కోరికలనే బియ్యము. దాని క్రింద పెట్టిన అగ్ని Wisdom Fire (జ్ఞానాగ్ని). ఈ మంట ఎందుకు పెట్టాలి? బియ్యం ఉడకటానికి. కాని ఈ వేడి Direct గా బియ్యానికి చేరటం లేదు. ఈ మంట మొట్టమొదట పాత్రను వేడిచేస్తుంది. తరువాత ఆ పాత్రలోని నీరును వేడి చేస్తుంది. ఆ వేడినీరు బియ్యాన్ని ఉడికిస్తుంది. కనుక మొట్టమొదట ఈ దేహమనే పాత్రకు వేడి కలిగించాలి. అదియే Near... Near... అనేటటువంటిది. తరువాత ఆ పాత్రలోని 'ప్రేమ' అనే జలము వేడెక్కుతుంది. ఆ నీరు వేడెక్కినప్పుడే ఈ Desires. (కోరికలు) అనే బియ్యం ఉడుకుతాయి. కనుక మొట్టమొదట దేహం Near. మనసు Dear(ప్రేమ). ఈరెండూ ఒకటైపోయినప్పుడు Desires, Fire అవుతాయి. అనగా Desires, Disappear అయిపోతాయంటారు బాబా. అనగా కోరికలు అదృశ్యమైపోతాయి. ఇదియే వేదాంతతత్త్వము.

## NEAR - DEAR

సత్సంగము వలన సద్భావనలు ఏర్పడతాయి. అందువలన సత్సంగమునకు సమీపుడవు కావాలి. సమీపుడవైనంత మాత్రముననే చాలదు. సత్సంగాన్ని ప్రేమించాలంటూ "Near (దగ్గర) కావటమే కాదు Dear (ప్రియమైన) కావాలి. Near & Dear గా ఉండినప్పుడే బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి అవుతుంది." అంటారు బాబా. "సాయిభక్తులం... సాయిభక్తులం" అని అనుకుంటున్నారు. కాని సాయి ఆజ్ఞలను ఎంతమంది ఎంతవరకు పాటిస్తున్నారు. ఎన్నో సంవత్సరములనుండి ఇక్కడనే ఉంటున్నారు. ఏమి ఆచరిస్తున్నారు? వినటం కాదు ప్రధానం, ఆచరించడం ముఖ్యం. ఏదో ఉన్నారు. పుష్పాల సమీపంలో కప్పలు ఉండినట్టుగా ఉంటున్నారు. కాని దూరం నుంచి వస్తున్నాయి తుమ్మెదలు. ఆ పుష్పములలోని మకరందాన్ని త్రాగి పోతున్నాయి. ఇక్కడ మీరు Near లోనే ఉన్నారుగాని Dearగా లేరు. ఆ తుమ్మెదలకు Dear ఉన్నదిగాని Near లేదు. కాని మనం పూర్తిగా అనుభవించాలంటే Dear & Near రెండూ ఉండాలి" అని అంటారు బాబా. కనుక ప్రతి ఒక్కరూ సత్సంగంలో లీనం కావాలి. భగవదాజ్ఞలను శిరసావహించాలి, వాటిని ఆచరణలో పెట్టాలి. అప్పడే భగవదానుగ్రహం లభిస్తుంది. అప్పడే మనం భగవంతునికి Near & Dear కాగలుగుతాము.

## RANKS - BLANKS

"మార్కులు చూస్తే ర్యాంకులు (Ranks), గుణములు చూస్తే బ్లాంకులు (Blanks)" అని ఒక పర్యాయం చమత్కరించారు బాబా. ఇది చమత్కారం కాదు. ఇది వాస్తవం. ఒక్క తెలివితేటల వలననే ప్రయోజనం లేదు. తెలివితేటలతోపాటు సద్గుణాలను కూడా పెంచుకోవాలి. అయితే ఈనాడు విద్య పెరిగినకొలది సద్గుణాలు తరిగిపోతున్నాయి. ఈనాడు చాలామంది విద్యార్థులు ర్యాంకులు సంపాదిస్తున్నారు, Gold Medals కూడా పొందుతున్నారు. ఏమిలాభం? అసలు ఉండవలసిన గుణం మాత్రం ఉండటంలేదు. గుణం అంటే శీలం (Character). "శీలం లేని వ్యక్తి చిల్లికుండతో సమానం" అన్నారు గదా! శీలమే జీవునికి అలంకారం. శీలము లేనివాడు పశువుతో సమానం. సామాన్యులు బాహ్య సౌందర్యమునకు విలువ ఇస్తుంటారు. భగవంతుడు మాత్రము సచ్ఛీలము (Good Character)నకు ప్రాధాన్యతనిస్తాడు. భగవంతుని దృష్టిలో సచ్ఛీలమే ధనము, సదాచారమే సంపద. శీలము లేనివాడు ఏ రంగములోనూ ప్రకాశించడు, రాణించడు. అదే విధంగా గుణవంతుడుకాని విద్యార్థి ర్యాంకులు సంపాదించినా పెద్దల మెప్పును పొందలేడు, శోభించలేడు. కనుక ప్రతి విద్యార్థి ర్యాంకులతోపాటు సద్గుణ సంపన్నుడు కావాలి, విద్యా వినయశీలశోభితుడు కావాలి.

## RETIRE - TIRE

దీపం ఉన్నప్పుడే మనం మన పనులను చక్కపెట్టుకోవాలి. పడవ చిల్లులుపడి శిథిలం కాక పూర్వమే నదిని దాటాలి. అన్ని విధాలా పటుత్వంగానున్న సమయంలోనే చేయవలసిన సత్కార్యాలు చేయాలి. దైవకార్యాలను ఆచరించాలి. సాధనలు సలిపి దైవానుగ్రహమునకు పాత్రులం కావాలి. వర్షాకాలంలో Tank ను పూర్తిగా నింపితే, ఎండాకాలంలో కూడా చక్కటి పంటలు పండించుకోవచ్చును. అయితే కొంత మంది అబ్బే! ఇప్పటినుంచే భగవచ్చింతన ఎందుకు? Retire అయిన తరువాత ప్రశాంతంగా జపం చేసుకుంటూ కూర్చోవచ్చునంటారు. కాని "Retire అయిన తరువాత మన అంగములు Tire అయిపోతాయి. అప్పుడు మనం ఏమి చేయగలుగుతాం?" అని బాబా ఒక పర్యాయం చమత్కరించారు. బాబా చెప్పింది నూటికి నూరుపాళ్ళు నిజం. జవసత్వాలు ఉడిగిన తరువాత చేయగలిగేదేమీ లేదు. ఓపిక ఉన్నప్పుడే ఏ పనినైనా చేయగలుగుతాం, దేనినైనా సాధించగలుగుతాం. వయసు మళ్ళిన వారికి ఏకాగ్రత కుదరదు. కనుక ఒంటిలో శక్తి ఉన్నప్పుడే దైవచింతనకు కొంత సమయాన్ని కేటాయించాలి. అలా చేయకుండా అవసాన

దశలో చింతించితే ప్రయోజనం ఉండదు. "దీపం ఉండగానే ఇల్లు చక్కపెట్టు కోవాలి" అనే లోకోక్తిని విస్మరించరాదు.

## RIGHT - FIGHT

"I am not outsider (నేను పరాయివాణ్ణి కాదు) కనుక నాకు ఎవరూ Thanks చెప్పకండి. Right కోసం Fight చేయండి. 'నాస్వామి! నాస్వామి!' అని స్వంతంగా భావించుకోండి. అప్పడే మీకు సర్వవిధములైన హక్కులు చేకూరుతాయి. తల్లి అన్నం పెడితే ఎవరైనా Thanks చెబుతారా? బయట ఇంటికి వెళ్ళి అన్నం తిన్నప్పడు వారికి Thanks చెబుతాం. స్వంతవారికి Thanks చెప్పం. నేను పరాయివాణ్ణికాదు. కనుక నాకు Thanks చెప్పనవసరంలేదు." అని అంటారు సాయిమాత. అయితే ఈనాడు Rights (హక్కులు) కోసం Fight (పోరాటం) చేస్తున్నారుగాని Responsibilities (బాధ్యతలు)ను మాత్రం విస్మరిస్తున్నారు. ఇది ఏ మాత్రం మంచిది కాదు. బాధ్యతలు గుర్తించిన వారికే హక్కులకోసం పోరాడే హక్కు వస్తుంది. బాధ్యతలను విస్మరించి హక్కుల కోసం పోరాడేవారు స్వార్ధపరులే గాని పరార్ధపరులుకాదు. పరమార్ధపరులు అంతకన్నాకాదు.

## QUANTITY - QUALITY

బీదలకు ఎంత యిచ్చావు? ఏ చీరెలు ఎన్ని యిచ్చావు? ఎంత అన్నం పెట్టావు? ఎంతమందికి పెట్టావు? ఎన్ని మూటల బియ్యం యిచ్చావు? వీటన్నింటిని భగవంతుడు చూడడు, పట్టించుకోడు. భగవంతునికి కావల్సింది భావమే. భగవంతుడు భావమును చూస్తాడేగాని బాహ్యమును చూడడు. భగవంతుడు భావప్రియుడేగాని బాహ్యప్రియుడు కాదు. స్వామి కోరేది Quantity కాదు, Quality మాత్రమేనని చెప్పి బాబా చక్కటి ఉదాహరణలు పేర్కొనినారు. కేవలం చిన్న తులసి దళంతో కృష్ణుని తూచింది రుక్మిణి. కేవలం పిడికెడు అటుకులు పెట్టి కృష్ణుని అనుగ్రహమును సంపాదించాడు కుచేలుడు. తెగి రక్తము వస్తున్న కృష్ణుని వ్రేలుకు ఏమాత్రం ఆలోచించకుండా తన చీరెను చించి ఆ వ్రేలుకు కట్టింది ద్రౌపది. అదే అక్షయమైన వలువలనిచ్చింది. "కృష్ణా! నీవే గతి" అని అక్షయపాత్ర అడుగును అంటుకొనిఉన్న ఒక చిన్న మెతుకుని కృష్ణుని చేతిలో పెట్టి నమస్కరించింది. అదే అక్షయం - అక్షయంగా మారిపోయింది. కనుక ఇంతైనా భగవంతునికి చేసినప్పడు ఎంతైనా భగవంతుని నుండి అందుకోవటానికి వీలవుతుంది. ఎంత యిచ్చావు? అని భగవంతుడు చూడడు. భగవంతుడు చూచేది నీ భావమునే. అన్ని అవతారములయందును చిన్న చిన్న వాటితోనే

అనంతమైన తత్త్వాన్ని పొందుతూ వచ్చారు. కనుక మనలోనున్న దోషములను దూరం చేసుకోండి! అహంకారమును నిర్మూలనం చేయండి! అర్పితమనే దానిని నేర్చుకోండి! అప్పుడే ఆనందమనే భాగ్యం మీకు లభిస్తుందంటారు బాబా.

## RUST - DUST

"Laziness is Rust and Dust, Realisation is Best and Rest. సోమరితనమే తుప్పు, ధూళి. సాక్షాత్కారము ఉత్తమోత్తమమైనది" అని అంటారు బాబా. ఈనాటి విద్యార్థులలో సోమరితనం ప్రబలిపోతున్నది. ఇనుము మట్టితో కప్పబడితే తుప్పు ఆవరిస్తుంది, ఇనుము తన శక్తిని కోల్పోతుంది. అదేవిధంగా సోమరితనం విద్యార్థులను ఆవరిస్తే, వారి తెలివితేటలు బండబారిపోతాయి, ఎందుకూ పనికిరాకుండాపోతారు.

మానవునిలో విశిష్టమైన దివ్యత్వం ఉండినప్పటికినీ, దానిని తెలుసుకోలేక, అత్యల్పమైన భావములు తనలో ప్రవేశపెట్టుకోవటంచేత, స్వతఃసిద్ధంగా ఉన్న మానవత్వాన్ని కోల్పోతున్నాడని బాబా ఒక పర్యాయం చెబుతూ ఒక చిన్న ఉదాహరణ చెప్పారు. గట్టిగా నున్న ఇనుపముక్కను మట్టిలో వేస్తే, కొంతకాలానికి దానికి Dust (దుమ్ము) పట్టి, Rust (తుప్పు) అవుతుంది. ఆ Rust పట్టడంచేత ఆ ఇనుము శక్తి అంతా Burst (బద్దలవుట) అయిపోతుంది. ఈ Burst అయినప్పుడు దానిని అగ్నిలోవేసి Test చేయాలి. ఈ Test చేసినప్పుడు దానిపైనున్న మాలిన్యమంతా పోయి ప్రకాశవంతమైన ఇనుముగా రూపొందుతుంది. అదేవిధంగా ఈ మానవుడు కూడా అజ్ఞానమనే 'మాయ'లో పడి తనలోనున్న దివ్యత్వాన్నే విస్మరిస్తున్నాడు. తన శక్తిని తాను గుర్తించుకోలేకపోతున్నాడు. ఈనాడు మానవుడు అల్పత్వాన్ని ఆశించి, అధికత్వాన్ని విస్మరించి, మానవత్వాన్నే కోల్పోతున్నాడు. కనుక మొట్టమొదట మీలో నున్న అల్పభావాలను, దుఃఖవిచారములను 'జ్ఞానాగ్ని'లో వేసి, కాల్చి, అల్పజీవులమని భావించక ఆత్మ స్వరూపులుగా విశ్వసించమంటారు బాబా.

## SAINT - SCIENTIST

ఈనాడు సైంటిస్టులు చాలా క్రొత్త విషయాలను కనుక్కుంటున్నారు. కాని మానవత్వమందున్న దివ్యశక్తిని మాత్రం వారు తెలుసుకోలేకపోతున్నారు. కారణమేమిటి? ఇది సైన్సు చెప్పదు. దైవశక్తి ఇట్టిదీ, అట్టిదీ అని ఎవరూ చెప్పలేరు. విజ్ఞానము (Science) నకు, ఆధ్యాత్మికము (Spirituality) నకు ప్రధాన

బేధమేమిటంటే, బాహ్యమైన జగత్తును Science పరిశీలన చేస్తుంది. అంతః సంబంధమైన దివ్యతత్త్వాన్ని ఆధ్యాత్మికము (Spirituality) పరిశీలన చేస్తుంది. బహిర్ దృష్టి కలవాడు Scientist. అంతర్దృష్టి కలవాడు Saint. వీరిద్దరికీ ఎంతో తేడా ఉన్నది. సృష్టిని పరిశీలన చేసేవాడు Scientist. సృష్టికర్తను పరిశీలించేవాడు Saint. సైంటిస్టు సృష్టిని మాత్రమే పరిశీలన చేస్తున్నాడు. కానీ సృష్టికర్తను పరిశీలిస్తే సృష్టి అంతా బాగా అర్థమవుతుందంటారు బాబా.

"ఈనాడు సైంటిస్టులు ప్రేమతత్త్వాన్ని విభజించి పదార్థతత్త్వాన్ని మాత్రమే ప్రకటిస్తున్నారు. Splitting of Love is Science, Spirit of love is spirituality. ప్రేమను విభజించడం ద్వారానే Matter వారికి దొరుకుతున్నది. సైంటిస్టుకు ప్రేమ తెలియదు. సైంటిస్టుకు Purity తెలియదు. వారికి Discrimination అనగా విచారణా మేధాశక్తి మాత్రమే ఉన్నది." అని అంటారు బాబా. మనం Spirit of Love ను Develop చేస్తే, అదియే జగత్తునంతా ఏకం చేస్తుంది. ఐకమత్యం ఒక్క ప్రేమ చేతనే సాధ్యమవు తుందంటూ "ప్రేమతత్త్వమును పెంచుకోండి!" అని బోధిస్తున్నారు భగవాన్ బాబా వారు. కనుక ప్రేమను పెంచుకోండి! పదిమందికి పంచండి.

## *SEASON - REASON*

"పశుపక్ష్యాదులకైన ఒక Season (ఋతువు) ఒక Reason (కారణం) ఉంది. మానవులకు మాత్రం No Season, No Reason" అంటారు బాబా. ఈ మాటల వెనుకనున్న బాబా ఆవేదన మనం అర్థం చేసుకుంటే సమాజానికి ఎంతో మేలు చేసిన వారమవుతాం. పశుపక్ష్యాదులకు మాటలురావుగాని, అవి ఆచరించి చూపిస్తాయి. మాటలు వచ్చిన మానవుడు మాత్రం ఆచరణలో ఏమీ చూపించటం లేదు. పశుపక్ష్యాదులకు ఆకలివేస్తే, ఎంతదూరమైనా వెళ్ళి కడుపునిండా తిని తిరిగి వస్తాయి. వాటికి దాచుకునే స్వార్థపరత్వంగాని, దోచుకునే రాక్షసత్వంగాని లేదు. దోచుకునేవాడు, దాచుకునేవాడు మానవుడు మాత్రమే అని చెబుతూ "మానవుల కంటే మృగములే మేలేమో!" అన్నారు బాబా. ఇది నూటికి నూరుపాళ్ళు సత్యం. పశుపక్ష్యాదులు ఏపనిచేసినా కాలము (ఋతువు) ననుసరిస్తాయి. వాటికి కొన్ని కట్టుబాట్లు కూడా ఉన్నాయి. వాటికి మాటలు రాకపోయినా వాటిని అతిక్రమించవు. అదే వాటి ప్రత్యేకత. ఇకపోతే విజ్ఞాన వంతుడనని విర్రవీగే మానవునికి మాత్రం హద్దులు లేవు, పద్దులులేవు. నీతి నియమాలు అసలే లేవు. ఋతుధర్మాలను అనుసరించకుండా, మృగంకన్నా హీనంగా, విచ్చలవిడిగా ప్రవర్తించేవాడు, అకారణంగా ఇష్టం వచ్చినట్టు సంచరించేవాడు ఒక్క మానవుడు మాత్రమే. కనుక మాటలు నేర్చిన "ద్విపాద పశువు" మానవుడు అంటే ఏ మాత్రం అతిశయోక్తి లేదు.

## SELF - HELP

"ఇంటగెలిచి రచ్చ గెలువు" అన్నారు మన పెద్దలు. మొట్టమొదట మీ ఇల్లు చక్కదిద్దుకుని, ఆ తరువాత వీధిలోనికి పోయి సేవలు చేయాలి. అంతేగాని ఇంటిని మాత్రం విసర్జించరాదు. మన ఇంట్లోవారిని సంతృప్తిపరచటం మన కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని మొదట నిర్వర్తించి, మిగిలిన కాలాన్ని సమాజ సేవలో ఉపయోగపెట్టాలి. మీ ఇంటిలోనివారిని బాధపెట్టి, వీధిలోనికిపోయి సేవ చేయడమనేది 'సాయి' ఒప్పకోడు. పునాది గట్టిగా లేకుండా గోడలు నిలువలేవు గదా! అంటూ "మొదట Self చూచుకో! తరువాత Help చేయి!" అంటారు బాబా. బాబా ప్రతివిషయాన్ని సూక్ష్మంగా పరిశీలిస్తారు. Practical (అనుభవం)గా ఆలోచిస్తారు. బాబా Self చూచుకోమన్నారు గదాయని పూర్తిగా స్వార్థపరులం మాత్రం కాకూడదు. స్వార్థం ఉండాల్సిందేగాని అది మితిమీరకూడదు. మితిమీరితే మతి చెడుతుంది. కనుక ఎవరి శక్తినిబట్టి వారు సేవలలో పాల్గొంటుండాలి. శక్తికి మించిచేస్తే అహంకారమవుతుంది, శక్తిఉండి కూడా చేయకపోతే స్వార్థమవుతుందంటారు బాబా. కనుక శక్తి వంచన లేకుండా సమాజ సేవలో పాల్గొంటుండాలి. సమాజసేవే సర్వేశ్వరుని సేవగా భావించాలి.

## SINGER - SINNER

మనం భజనలు చేస్తున్నాం. కాని భావాలను మార్చుకుంటున్నామా? లేదు. మనలోనున్నటువంటి దుర్భావనలు, దుశ్చింతనలు, దురాలోచనలనేటటువంటి మృగతత్త్వాలు, పశుతత్త్వాలు, భజనలతోపాటు అవికూడా పెరుగుతూనే ఉన్నాయి. అట్టి పశుభావాలను మనం అణగద్రొక్కుకొనకుండా, ఎన్నివిధములైన భజనలు చేసినప్పటికినీ నీవు Singer (పాటపాడువాడు) వు కాదు, నీవు Sinner (పాపి) వే అవుతావంటారు బాబా. ఈ మాటల వెనుకనున్న బాబా ఆవేదనను అర్థంచేసుకుంటే భక్తులకు జ్ఞానోదయం అవుతుంది. కనుక మనలోనున్న పశుత్వభావాలను నిర్మూలనం గావించుకొనకుండా, ఎన్నివిధములైనటువంటి, బాహ్యమైనటువంటి భజనలు, పూజలు చేసినప్పటికినీ, తీర్థములు, క్షేత్రములు సందర్శించినప్పటికిని ఏమాత్రం ప్రయోజనం లేదు.

## SKILL - KILL

ఈనాడు విద్యార్థులు Knowledge Skill చేయటంలేదు. kill చేస్తున్నారు. kill చేయటం వలన Balance తప్పతున్నది. ఈ Balance తప్పటం వలననే Insight (అంతర్దృష్టి) తగ్గిపోయి, Outlook (బహిర్దృష్టి) పెరుగుతున్నదంటారు బాబా.

మానవత్వాన్ని కోల్పోయిన విజ్ఞానం మారణహోమానికి దారితీస్తుంది. విచక్షణారహితమైన నైపుణ్యం (Skill) వినాశనానికి దోహదం చేస్తుంది. ఆలోచనా రహితమైన మేధాశక్తి (Intellect) సర్వనాశనానికి దారితీస్తుందంటారు బాబా. మేధాశక్తికీ, నైపుణ్యానికీ మధ్య సమతూకం (Balance) లోపించడం వలననే ప్రపంచంలో నేడు తరచుగా ఉప్పెనలు, తుఫానులు, భూకంపాలు సంభవిస్తున్నాయని చెప్పారు బాబా. ఖనిజ సంపదకోసం భూమిని లోతుగా త్రవ్వి తొర్రచేయడం వలనను, భూతలముమీద ఆకాశహర్మ్యాలు నిర్మించడం వలనను, సముద్రగర్భము నుండి కోట్లాది టన్నుల చేపలను వెలికితీయడం వలనను, భూగర్భములోని వాయువును, చమురు నిక్షేపాలను ఖాళీ చేయడం వలనను, అడవులను విచక్షణా రహితంగా నరకడం వలననూ - ఈ సమతూకం (Ecological Balance) లేకుండాపోయి తరచుగా ఊహించని అవాంతరాలు, భయంకర జలప్రళయాలు, భూకంపాలు సంభవిస్తున్నాయని బాబా ఒక పర్యాయం చెబుతూ Skill నుండి 'S' మైనస్‌చేస్తే (Skill-S=Kill) Kill అవుతోందని చమత్కరించారు. ఈ మాట పైకి చమత్కారంగా వినిపించినా , ఇది యదార్థం, వాస్తవం. ఈనాడు ప్రపంచంలో ఈ Balance లోపించడం వలననే ప్రళయాలు సంభవిస్తున్నాయి. భగవాన్ బాబావారు కేవలం ఆధ్యాత్మిక దృష్టితోనేగాక శాస్త్రీయదృక్పథం (Scientific outlook)తో కూడా ప్రాపంచిక విషయాలను పరిశీలిస్తున్నారనే విషయం స్పష్టమవుతున్నది.

## S - S - S - B

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు తమ పేరులో ఉండినటువంటి అంతరార్థమును విశిష్టతను తామే పలు సందర్భాలలో వివరించారు. "సాయి అనగా స+అయి = దివ్యమాత. 'బాబా' అనగా పిత. సాయిబాబా అనగా దైవిక మాతాపితలని అర్థం. నాయందు తల్లి గుణములు, తండ్రి గుణములు రెండూ ఉన్నవి. ఈ రెండు స్వభావములు నాయందున్నందున ఇది 'శివశక్తి' స్వరూపము. నేను తల్లి వలె లాలించుతాను. తండ్రివలె అదిలించి, బెదిరించి, దండించి, శిక్షించి సరియైన ఉన్నత స్థాయికి తీసుకొని వెళ్ళుతాను. నాపేరు SAI అంటే నేను IAS ను. అనగా Indian Administration Service అని అర్థము. అధికారులు జిల్లా రాష్ట్ర కేంద్ర అధికారులుగానే పనిచేస్తుంటారు. ఈ SAI మాత్రం విశ్వపరి పాలకుడుగా పని చేస్తుంటాడు" అని చెప్పారు బాబా.

ఒక పర్యాయం 'సనాతన సారథి' ఎడిటర్ కీ.శే. కస్తూరి గారితో చమత్కారంగా స్వామి ఈ విధంగా అంటారు. S.S.S.B. means 'Sri Satya Sai Baba' అంటూ నాలుగు అక్షరములకు చక్కటి వివరణ యిచ్చారు. S=Sangha; S=Samsukriti;

S=Sanatana Dharma; B=Blocking others. అనగా సంఘమునకు సేవచేస్తూ, సంస్కృతిని పోషిస్తూ, సనాతన ధర్మమును ఉద్ధరించటమే సాయి ఉద్యమ లక్ష్యము అని బాబాయే స్వయంగా చెప్పారు.

మరొక పర్యాయం స్వామి చమత్కారంగా నాపేరు Baba అంటే నేను Double Graduate ను. అని చెబుతూ Baba పదములోని నాలుగు అక్షరములకు చక్కటి అర్థం చెప్పారు. B=Being (సత్); A=Awareness (చిత్); B=Bliss (ఆనంద); A=Atman (ఆత్మ) అని చెబుతూ "I am Satchidananda Atman నేను సచ్చిదానంద ఆత్మను" అంటారు బాబా.

మరొక పర్యాయం 'Sai' అనే పదమునకు చక్కటి వివరణ యిచ్చారు బాబా. S=Spiritual Change; A=Association Change; I=Individual Change. ఆధ్యాత్మిక పరివర్తన, సాంఘిక పరివర్తన, వ్యక్తి యొక్క పరివర్తన రావాలంటూ ఈ మూడింటి యొక్క తత్త్వమే 'సాయి' ఆశయం అని చెప్పారు. ఇట్టి పరివర్తన జరిగినప్పుడు ప్రపంచమంతా సుక్షేమంగా ఉంటుంది అంటూ వ్యక్తిగత పరివర్తన లేకుండా, సాంఘిక పరివర్తన రాకుండా, ఆధ్యాత్మిక పరివర్తన ఎలా వస్తుంది? ఈ మూడింటి యందున్న ఏకత్వమే ప్రేమతత్త్వము. అట్టి ప్రేమతత్త్వమును ప్రతి ఒక్కరూ అభివృద్ధి పరచుకోవాలంటారు బాబా.

మరొక పర్యాయం 'Sai' అనే పదములోని మూడు అక్షరములకు చక్కటి అంతరార్థమును వివరించారు. S=Service; A=Aderation; I=Illumination- ఈ మూడే కర్మ, భక్తి, జ్ఞాన యోగములు. (Action. Devotion. Wisdom) కనుక మొట్టమొదటిది Service - అదే కర్మ. రెండవది Aderation అదియే భక్తి. అదియే Spirit of Love. మూడవది Illumination అనగా విచారణాశక్తి. అదియే జ్ఞానము అని చెబుతూ "కర్మోపాసన జ్ఞానముల యొక్క సమ్మిళిత స్వరూపమే 'Sai' " అన్నారు. భగవాన్ బాబావారు. కనుక మొట్టమొదట సాయి సంస్థలలోని వారు ఈ మూడింటిని చక్కగా హృదయపూర్వకంగా అభివృద్ధి గావించుకోవాలి.

స్వామి తన ఉద్యమ లక్ష్యాన్ని, దృఢ సంకల్పాన్ని వివరిస్తూ "సనాతన ధర్మాన్ని ఉద్ధరించటమే సాయి ఉద్యమ లక్ష్యము. ఈ ఉద్యమ నిర్వహణలో ఎన్ని అడ్డంకులను ఎదుర్కొనవలసి వచ్చినా, వాటిని సమత్వదృష్టితో సహిస్తాను. నేను ఏ ప్రదేశానికి చెందిన వాడనుకాదు. నేను ఏ పేరుకు సంబంధించబడను. నా అన్నది నాకేదీ లేదు. నీవు ఏ పేరుతో పిలిచినా నా సమాధానం లభిస్తుంది. ఎక్కడికి పిలిస్తే అక్కడకు వెళ్తాను. ఇది నా మొదటి ప్రతిజ్ఞ. మానవజాతికోసమే నేను ఏది చేసినా! రానున్న సంవత్సరాలలో నా యీ వైభవాన్ని మీరే కళ్ళారా చూడగలరు" అని స్వామి స్పష్టం చేశారు. ఇటువంటి హామీని సామాన్యులు ఎవ్వరూ యివ్వలేరు. ఒక్క

దైవానికే అది సాధ్యమవుతుంది. మానవజాతిని ఉద్ధరించడానికి భగవాన్ సాయి అవతరించారు. వారి సమకాలీన సమాజంలో ఉండే మహద్భాగ్యం, పూర్వజన్మ సుకృతం వలన మనకు లభించింది. దానిని మనం సద్వినియోగం చేసుకోవాలి.

## TANK - TAP

అధ్యాపకుడు ఇచ్చేవాడు, విద్యార్థి పుచ్చుకునేవాడు. అయితే ఇచ్చేందుకు టీచరు దగ్గర ఏమైనా సరుకు ఉండాలికదా! పుచ్చుకోవటానికి విద్యార్థి కూడా సిద్ధంగా ఉండాలి. అయితే ఈనాడు పుచ్చుకోవటానికి విద్యార్థి సిద్ధంగానూలేడు, ఇవ్వటానికి టీచరు దగ్గర సరుకూ లేదని చెబుతూ అధ్యాపకులను Water Tank తోను, విద్యార్థులను Tap తోను పోల్చారు బాబా. సహజంగా Tank లో ఎటువంటి నీరు ఉంటే, అటువంటి నీరే Tap లోకి వస్తుంది. అదేవిధంగా అధ్యాపకుడు ఎట్టివాడో, విద్యార్థి అట్టివాడుగా తయారవుతాడు. ఉపాధ్యాయుడు క్రమశిక్షణతో తనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించకపోతే వేలమంది విద్యార్థులు చెడిపోతారు. అధ్యాపకులు ఆదర్శజీవితాన్ని గడిపినప్పుడు విద్యార్థులు సత్ప్రవర్తనను అలవరచుకుంటారు. Water Tank లో పరిశుద్ధమైన నీరుంటే Tap లోనికి మంచినీరు వస్తుంది. అదేవిధంగా అధ్యాపకుడు పవిత్రమైన జీవితాన్ని గడిపితే విద్యార్థులు కూడా సచ్ఛీలసంపన్నులవుతారు. కనుక విద్యార్థులకు అధ్యాపకులు మార్గదర్శకులుగా ఉండాలంటారు బాబా.

## TAX - THANKS

అనిత్యము, అశాశ్వతము, అసత్యము, ప్రాకృతమైనటువంటి విషయములకు మనం ఎన్నియో Tax (పన్ను)లు కడుతున్నాము. ఎంతయో Thanks (కృతజ్ఞతలు) తెలుపుకుంటున్నాము. నిత్యమైన, సత్యమైన, శాశ్వతమైన సమస్త శక్తులను మనం అనుభవించడానికి అందిస్తున్న భగవంతునికి మనం ఏమి Tax ఇస్తున్నాం? మనం ఏమి Thanks చెబుతున్నాం? ఇంకా భగవంతుడు అది ఇవ్వలేదే? ఇది ఇవ్వలేదే? అని దూషిస్తున్నాం. Tank లో ఉన్న నీరు పంపులద్వారా మన ఇంటికి సప్లయి చేసినందులకు మున్సిపాలిటీ వారికి Water Tax కడుతున్నాం. మన స్థలంలో మనం ఇల్లుకట్టుకొని మున్సిపాలిటీ వారికి House Tax కడుతున్నాం. మన ఇంటికి కరెంటు యిచ్చినందుకు Electricity Tax కడుతున్నాం. ఎవరైనా చిన్నసహాయం చేస్తే చాలు Thanks చెబుతున్నాం. మన కర్చీఫ్ క్రిందపడితే, దానిని ఎవరైనా తీసిఇస్తే, వారికి Thanks చెబుతున్నాం మలయమారుతంగా గాలిని అందిస్తున్న భగవంతునికి మనం ఏమి Thanks చెబుతున్నాం? ఏమి Tax కడుతున్నాం?. దేదీప్యమానంగా జగత్తుకు ప్రకాశమునందిస్తున్న సూర్యభగవానునికి

ఏమి Thanks చెబుతున్నాం? ఏమిTax కడుతున్నాం? కుంభవర్షం కురిపించి, చెరువులను, వాగులను, నదులను నింపి పంటలకు నీరందిస్తున్న వరుణదేవునికి ఏమి Thanks చెబుతున్నాం? ఏమిTax కడుతున్నాం? అల్పమైన, స్వల్పమైనవాటికి మనం ఎంతో Tax కడుతున్నాం. నీరు, గాలి, వెలుతురు ఉచితంగా మనకు కావల్సినంత అనుగ్రహిస్తున్న భగవంతునికి మాత్రం మనం ఏమి Tax కడుతున్నాం? కనీసం Thanks కుడా చెప్పటంలేదే? అని తమ ఆవేదనను వెలిబుచ్చారు ఒక పర్యాయం భగవాన్ బాబావారు.

## TECHNOLOGY, TRICK-KNOWLEDGE

"ఈనాడు Science & Technology అభివృద్ధి అయిందంటున్నారు. ఏమిటి ఈ టెక్నాలజి? మనం నేర్చుకున్న Technology ఇది టెక్నాలజి కాదు, Trick Knowledge (ట్రిక్ నాలెడ్జి). కనుక ఈ ట్రిక్‌లలో మనం ప్రవేశించకూడదు." అన్నారు బాబా. ఈనాడు ట్రిక్‌లు, మోసాలు ఎక్కువైనాయి. ఈనాడు ఒక చంప సాంకేతిక విజ్ఞానం పెరుగుతున్నది. మరొకచంప సహృదయం తరిగిపోతున్నది. సైంటిస్టుకు సహృదయం లేకపోతే సంపాదించిన సాంకేతిక పరిజ్ఞానం సర్వనాశనానికి దారితీస్తుంది. మానవ కళ్యాణానికి ఉపయోగపడదు. కనుక శాంతి, ప్రేమ, దయలనే సద్గుణాలను శాస్త్రజ్ఞులు పెంచుకుంటే సమాజ సంక్షేమానికి ఎంతగానో ఉపయోగపడతారు. అంతేకాదు. ఈనాడు విజ్ఞానశాస్త్రరంగంలో వివేకాన్ని విస్మరిస్తున్నారు. విషయపరిశోధనకు విజ్ఞానమెంత అవసరమో, పరిశోధనా ఫలితాన్ని వినియోగించుకోవడానికి 'వివేకము ' అంత అవసరము. కనుక మానవతా విలువలను పెంపొందించుకొని, సంపాదించిన శాస్త్ర విజ్ఞానమును వివేకంతో సమాజశ్రేయస్సుకు వినయోగించాలంటారు బాబా.

## TEST - TASTE

మానవత్వంలోపల అప్పుడప్పుడు ఈ 'మాయ' చేరి అనేక రకములు Test (పరీక్ష) చేస్తుంటుంది. ఈ మాయ చేసే Test లకు మీరు ఏమాత్రం లొంగకండి! దైవం Test లో మీరు నెగ్గండి! అప్పుడే దైవము యొక్క Test (పరీక్ష) మీకు Taste (రుచి)గా మారిపోతుంది.

## TRY - DRY

"ప్రయత్నిస్తాం! ప్రయత్నిస్తాం! అంటూ కొంతమంది కాలయాపన చేస్తూ పోతుంటారు. కార్యాన్ని మాత్రం ప్రారంభించరు. Try...Try... అంటూ కాలయాపన చేస్తూ చివరికి అది 'Dry' అయిపోతుంది" అని బాబా ఒక పర్యాయం

చమత్కరించారు. ఇది చమత్కారం కాదు. మనం అర్థం చేసుకుంటే ఆ మాటల వెనుక ఎంతో అంతరార్థం ఉన్నది. 'ప్రయత్నిస్తాం' అనే మాట ఒక విధంగా తప్పించుకోవటానికి ఉపయోగించే పదజాలము మాత్రమే. 'చేస్తాం! చేసి తీరుతాం!' అనే మాటలలో ఉన్న దృఢవిశ్వాసం ఉండాలి. దృఢ నిశ్చయంతో గట్టిగా చెప్పగలగాలి. అయితే ఈనాడు చాలామందిలో ఈ దృఢనిశ్చయం వాక్కులో వినిపిస్తున్నదిగాని, కార్యాచరణలో మాత్రం కనిపించటం లేదు. ఇది మారాలి. మొదట మనసులో ఈ దృఢనిశ్చయం ఉండాలి. అది వాక్కులో వినిపించాలి. చేతలలో కనిపించాలి.

## *UNITY - PURITY*

"Unity (ఐకమత్యం) మనలో వచ్చినప్పుడే Purity (పవిత్రత) ఏర్పడుతుంది. Purity మనలో ఉన్నప్పుడే Divinity (దివ్యత్వం) మనలో ఉద్భవిస్తుంది. అయితే ఈనాడు Unity లేదు, Purity లేదు, Divinity లేనేలేదు. ఉన్నదల్లా ఒక్క Community (కులతత్త్వం) మాత్రమే అని బాబా తన ఆవేదనను వెలిబుచ్చారు. కులపిచ్చితో క్రుమ్ములాడుకుంటున్న ఈ రోజులలో, బాబా సందేశం ఆలకించి, ఆచరణలో పెడితే నిజంగా జాతీయసమైక్యతను సాధించినవారమవుతాం. మానవులంతా ఒకే కులమని బాబావారి విశ్వాసం. అసలు దేహాన్నిబట్టే ఈ కులాలు, మతాలు, తెగలు వచ్చాయిగాని నిజంగా 'ఆత్మ'కు ఎట్టి కులం లేదంటారు బాబా. కనుక ప్రతి ఒక్కరు ఇటువంటి విశ్వాసాన్ని, విశాలభావాన్ని పెంచుకోవాలి.

## *UNITY - ENEMITY*

"ఈనాడు విద్యార్థులలో Unity (ఐకమత్యం) లేకుండా పోతున్నది. Enemity (శత్రుత్వం) ప్రబలిపోతున్నది" అని బాబా తన ఆవేదనను వెలిబుచ్చారు. ఇది అత్యంత ప్రమాదకరం. ఈనాడు అసెంబ్లీ ఎన్నికల స్థాయిలకంటే పెద్ద ఎత్తున కళాశాల ఎన్నికలు జరుగుతున్నాయి. వేలు, లక్షలు, ఖర్చు చేస్తున్నారు. పర్యవసానం తగాదాలు, హత్యలదాకా పోయి కళాశాలలు మూతబడుతున్నాయి. కనుక Enemityని పెంచటానికి దోహదం చేసే Elections కాలేజీలలో లేకపోయినా ఫర్వాలేదు.

